కథానికా సీరీస్
కథానిక - రెండు

విజ్ఞాన సాహితి
మద్రాసు-17.

ప్రచురణ సెప్టెంబరు '55
వెల ఒక రూపాయి

ఇది రెండవ కథానిక —
క్రొత్తరచయితల క్రొత్త కథ
లతో నెలనెలా 'కథానిక'
వెలువడుతుంది. క్రొత్త రచ
యితల కథలను 'కథానిక'లో
ప్రచురించే పూచీ మాది. రక
రకాలైన ఇరవై కథలతో
చక్కని గెటప్‌తో నెలనెలా
'కథానిక' ప్రతులు ఆంధ్ర
దేశమంతటా అందుతాయి.
మీా కథలు కూడా ప్రచురింప
బడాలంటే వివరాలకు మాకు
వ్రాయండి.

సంచాలకులు

**Vignana Sahiti**

Madras-17.

ఇందులో

కమలాదేవి

# విముక్తి

అది సూర్యాస్తమయసమయం. నేడే దీపావళీ మహాపర్వం. ప్రజలంతా బీద భాగ్య విచక్షణలేకుండా తమతమ ఇళ్లు శుభ్రపరచుకుని అలంకరించుకున్నారు. ఇంటింటా దీపమాలికలు వెలుగుతున్నాయి. నలుమూలలా బాణాసంచా మ్రోతలు వినవస్తున్నాయి. అంతా ఇళ్ళల్లో లక్ష్మీపూజలు చేసుకుంటున్నారు.

లలితకూడ ఈరోజున తన ఇంటిని రకరకాల విద్యుద్దీపాలతో అలంకరించింది. పూజా సామగ్రిని సిద్ధపరచుకుంది. స్నేహితురాళ్ళతో కలసి దేవాలయానికి వెళ్ళింది.

దేవతాదర్శనంకోసం వచ్చిన ప్రజలతో దేవాలయం కిటకిటలాడుతోంది. దీపపుకాంతులతో దేవాలయం అతి స్వచ్ఛంగా ప్రకాశిస్తోంది. రంగురంగుల చీరెలు ధరించి వచ్చిన స్త్రీలు విద్యుద్దీపాల ప్రకాశంలో ఎంతో ఆకర్షణీయంగా కనిపిస్తున్నారు. వారందరిమధ్యా నీలి రంగుచీరె ధరించి, స్వర్గంనుంచి అప్పుడే దిగివచ్చిన అప్సరసలా లలిత దేవతాసాన్నిధ్యంలో నిలబడిఉంది.

లలిత తన తల్లిదండ్రులకి ఏకైకపుత్రిక. చాల అందమైనది. సౌందర్యానికి తగిన వినయం, వినయానికి తగిన బుద్ధికుశలతా ఆమెలో మూర్తీభవించాయంటే అతిశయోక్తికాదు.

సకలసద్గుణ సంపన్నయైన లలితనుచూచి అంతా మెచ్చుకుంటున్నారంటే ఆశ్చర్యమేముంది? ఆమె సౌందర్యాన్ని చూచిన వాళ్ళంతా భగవంతుని సృష్టినైపుణ్యాన్ని వేనోళ్ళ మెచ్చుకోనేవారే. ఆమెని సృష్టించడంలో భగవంతుడు తన బుద్ధిబలాన్ని బాగా ఉపయోగించి తన కళానైపుణ్యాన్ని చరమసీమవరకూ తీసుకుపోయాడని అనుకునితీరాలి. దేవాలయమంతా చక్కగా అలంకరించబడి ఉంది. ఆ దేవాలయ శోభ కళ్ళారచూసి ఆనందించాలని స్త్రీ పురుషులు తండోపతండాలుగా వస్తున్నారు. ఆ జనసముద్రంలో పాతికేళ్ళ యువకుడొకడు కూడ

ఉన్నాడు. అతను లలిత అద్భుత సౌందర్యాన్నిచూసి చకితుడై రెప్ప ల్లార్పకుండ ఆమెవేపు చూస్తూ నిలబడిపోయాడు.

పూజ సమాప్తంకాగానే అంతా ఎవరిళ్లకు వాళ్ళు బయలుదేరారు. కాని ఆయువకుడు మోహన్ మాత్రం నిశ్చేష్టుడై అలాగే నిలబడిఉన్నాడు. పూజారి మెల్లగా అతని దగ్గరికివచ్చి వీపు తట్టాడు. అప్పటికిగాని మోహన్ తనస్థితిని తెలుసుకోలేదు. అతడు సిగ్గుపడి గబగబా నడిచి దేవాలయం బయటికి వెళ్ళిపోయాడు. ఏదో ఆలోచించుకుంటూ మెల్లిగా ఇంటికి జేరుకున్నాడు.

ఇంటికి జేరుకోగానే తన చెల్లెలు లీలని పిలిచాడు. "నీలిరంగు చీరె కట్టుకుని నీ ప్రక్కని నిలబడ్డ అమ్మాయి ఎవరు?" అని అడిగాడు. లీలకి అతని వాలకం ఏమీ అర్థంగాక "మేజిస్ట్రేట్ ప్రసాదరావుగారి అమ్మాయి లలిత సంగతా నువ్వు అడుగుతోంటూ?" అని ఎదురు ప్రశ్నించింది.

మోహన్ తండ్రి చాలా భాగ్యవంతుడు. బ్యాంకిలో లెక్కలేనంత డబ్బు మూల్గుతోంది. భూములమీద వచ్చే ఆదాయానికి అంతేలేదు. గొప్ప జమీందార్లంతావచ్చి ఆయన దగ్గర అప్పులు తీసుకుంటూ ఉంటారు. పెద్ద హోదాగల కుటుంబము.

కుమార్తె లీలకి యుక్తవయస్సురాగానే తండ్రి ఆమెని ఒక పెద్ద జమీం దారుకిచ్చి పెళ్ళిచేశాడు. అల్లుడురాగానే కోడలినికూడ తెచ్చుకోవా లని అతనికి కుతూహలం కలిగింది. ఈ విషయం కొడుకుదగ్గర ప్రస్తావిం చాడు. మోహన్ లలితని చూచినప్పటినుంచీ మనస్సు ఆమెమీదే లగ్నంచేసి ఉన్నాడు. లలితనితప్ప ఇంకెవ్వరినీ పెళ్లాడనన్న తన నిశ్చయాన్ని తండ్రికి తెలియజేశాడు.

ప్రసాదరావుకూడ తన కుమార్తెకు వివాహం చెయ్యాలనే ప్రయత్నంలో ఉన్నాడు. ఇంతలో మోహన్ విషయం అతనికి తెలిసింది. మోహన్ అన్నివిధాల తన కుమార్తెకి తగిన భర్త అని అతను చాలా సంతోషిం చాడు. లలిత అదృష్టానికి అంతా చాలా సంతోషించారు. లలిత వివాహం స్థిరపడింది. సాయంత్రం ఏడుగంటలకి పెళ్ళికొడుకువారు

పెళ్లికూతురు వారింటికి వచ్చారు. ప్రసాదరావుగారిల్లు చుట్టపక్కాలతో కలకలలాడుతోంది. అతను పెళ్ళివారికెంతో ఆదరంతో స్వాగతమిచ్చి గౌరవించాడు. వాళ్ళు అతను చూపిన ఆదరాభిమానాలకి చాల సంతోషించారు. లలితామోహనుల వివాహం అతి వైభవోపేతంగా జరిగింది.

వివాహమైన కొద్దిరోజులకే లలిత కాపురానికొచ్చింది. ఆమెకి అత్తవారింట్లో హాయిగా కాలం గడుస్తోంది. ఏ విషయంలోనూ లోటు లేకుండ జరిగిపోతోంది. ఆ ఇంట్లో ఆమెదే సంపూర్ణాధికారం. ఖర్చు పెట్టేందుకు కావలసినంత డబ్బు.

మోహన్ భార్యని ప్రాణంగా చూసుకుంటున్నాడు. తన సర్వస్వం ఆమె అధీనం చేశాడు. లలితేతను, తనే లలితగా కాలం గడపసాగాడు. ఆమెని తన భాగ్యదేవతగా పూజించుకోసాగాడు. లలిత తన అదృష్టాన్ని చూసుకుని మురిసిపోయింది.

పెళ్ళి అయిన ఏడాదికే మోహన్ బి. యే. పూర్తి చేసుకుని మెడ్రాసులో ఉద్యోగం చేయసాగాడు. ఆ తరువాత కొద్దిరోజులకే మోహన్ తల్లిదండ్రులు పరలోకగతులయ్యారు.

మోహన్ ఇప్పుడు సర్వస్వతంత్రుడు. ధనమదం అధికారగర్వం అతన్ని పూర్తిగా ఆవహించాయి. దాంతో అతని జీవితమే తారుమారైపోయింది. ఇల్లూవాకిలి విడిచి దుష్టులసహవాసంలో తిరగసాగాడు. చూస్తూండగానే అనేక దురభ్యాసాలకి లోనయ్యాడు. కొన్ని రోజులకి ఇంటికిరావడమే పూర్తిగా మానేశాడు.

'తానొకటి తలుస్తే దైవమొకటి తలచింద'న్నట్లయింది పాపం లలిత జీవితం! భర్త వ్యవహారం చూసి ఆమె చాలా విచారించింది. ఇంట్లో ఉన్నప్పుడు కూడ తన్ను పలకరించడం మానేశాడు. తనే స్వయంగా పలకరించి ఏదైనా అడుగుతే అదలించి బెదరించడం మొదలెట్టాడు. 'నా జోక్యం నీ కెందుకు? ఈసారి ఏమన్నా అడిగావంటే జాగ్రత్త, ప్రాణాలు తీస్తా' - ఇదీవరస!

లలిత, పాపం ఏంచేయగలదు? దుఃఖాగ్నిలో కుమిలి కృశించి పోతోంది. ఆమె సౌందర్యమంతా నేడు ఏమైంది? మోహన్ ఆమె ముఖం చూస్తేనే మండిపడిపోతున్నాడు. నిత్యం అతనిచేత తిట్లు తినవలసిన యోగంకూడ ఆమెకి పట్టింది! ఏ భోగభాగ్యాలు ఆమెకి ఒకప్పుడు ఆనందదాయకంగా ఉండేవో అవేనేడు ఆమె జీవితానికి దుఃఖదాయకాలయాయి.

ఒకనాడు ప్రసాదరావు కుమార్తెను చూసేందుకు మద్రాసు వచ్చాడు. పాలిపోయిన ముఖంతో కృశించిపోయిన గాత్రంతో జీవచ్ఛవంలా ఉన్న లలితనుచూసి అతని హృదయం కంపించింది. కుమార్తె పరిస్థితులు తెలుసుకుని అతనిగుండె పగిలిపోయింది. ఒక్క క్షణంకూడ లలితని ఆ పరిస్థితులలో అక్కడ ఉంచడం అతనికి అతిఘోరంగా కనిపించింది. వెంటనే ఆమెను తీసుకుని ఇంటికి వచ్చేశాడు.

డాక్టర్లని పెట్టి ఆమెకి చికిత్సచేయించ సాగాడు - కాని మనోవ్యాధికి మందెక్కడ ఉంటుంది? నానాటికి ఆమె ఆరోగ్యం క్షీణించి పోసాగింది. వదినగారి పరిస్థితి తెలిసి లీల ఆమెని చూసేందుకువచ్చింది. 'వదిన చాలా ప్రమాద స్థితిలో ఉంది - వెంటనే బయలుదేరి రావలసిం'దని అన్నగారికి టెలిగ్రామిచ్చింది. కాని మోహన్ అది అబద్ధమనుకొని రాలేదు.

ఆ రోజు ఉదయంనుండి లలిత బ్రతుకు ఆశవదలి మోహన్‌నిచూడాలని కలవరిస్తోంది. కాని మోహన్ జాడ ఎక్కడాలేదు. లలిత ప్రమాద స్థితినిచూచి ఆమె తండ్రి అల్లుణ్ణి తీసుకొచ్చేందుకు తన స్నేహితుణ్ణొకాయన్ని మద్రాసు పంపించాడు.

మోహన్ ఇల్లు తాళంవేసి ఉంది. మోహన్ జాడ అతనికేం తెలియలేదు. ఆయనచేసేదేమీ లేక మోహన్ ఇంటి ప్రక్కవారికి లలిత పరిస్థితిని తెలియబరచి తిరిగివచ్చాడు.

సూర్యుడు అస్తమిస్తున్నాడు - నేడు దీపావళి పర్వదినం - సరిగ్గా రెండేళ్ల క్రితం ఇదే రోజున - ఇదే సమయంలో మోహన్ దేవాలయంలో

తన్ను చూశాడు- తనకి హృదయాన్ని అర్పించాడు. అట్టి తన హృదయాధి దేవతఅయిన మోహన్ నేడు ఏడీ! ప్రమాద పరిస్థితిలో ఉన్న తనకి ఆఖరుసారిగా దర్శనమివ్వడానికి రాడా?

అందరూ ఆమె పరిస్థితికి దుఃఖిస్తున్నారు. డాక్టర్లు ఇంక లాభంలేదని పెదవి విరిచారు. లలితకి భర్తమీద నమ్మకం ఉంది. ఈ దీపావళి నాటిరాత్రి తప్పక మోహన్ ఆఖరుసారి తన్ను చూసేందుకు వస్తాడు. ఆమె అతి శాంతంగా భర్తరాకకెదురు చూస్తోంది.

ఇంతలో ఒక పెద్ద తుపానుగా మోహన్ ఆమె ఉన్నగదిలోకివచ్చి పడ్డాడు. శోకసంతప్త హృదయంతో మృతుశయ్యపై నున్న లలితను కౌగలించుకున్నాడు.

లలిత సంతృప్తిని తెలియబర్చే దృష్టులతో భర్తవైపు ఒక్కక్షణకాలం చూసింది. ఏదో చెప్పాలని పెదవులు కదలించింది. కాని ఆమె నోటివెంట మాట రాకముందే ఆమె జీవనజ్యోతి ఆరిపోయింది. బయట ఇంటింటా దీపమాలికలు బారులు తీరి ప్రకాశిస్తున్నాయి. మోహన్ జీవితంలో మాత్రం అమావాస్యనాటి అంధకారాలు ఒక్కుమ్మడిగా వచ్చి క్రమ్ముకున్నాయి. అతను స్పృహతప్పి పడిపోయాడు.

లలిత మానవనిర్మితమైన సమస్త బంధనాలనుండి విముక్తి పొంది ఏ సుదూర దేవతాలోకాలో చేరుకుంది.

డిన్నరు పార్టీకి పిలిచిన అతిథులంతా ఒక్కరొక్కరే వస్తూవున్నారు. చిలకా గోరింకల్లా —ఆ చదువుకొన్న నూతన వధూవరద్వయం గుమ్మం దగ్గరే వుండి అందర్నీ లోనికి ఆహ్వానిస్తున్నారు. చాలాయేళ్లనుంచి కలుసుకోని మిత్రులుకూడా ఆ వాడక్కడకు రావటం నాకూ, వరుడు రాంబాబుకీకూడా యెంతో ఆనందంగ వున్నది. నేనాపార్టీ అరేంజి మెంట్సులో చాలా హడావిడిగావున్నా.

వచ్చిన ప్రాతస్నేహితుని చూడడంతోనే "మిస్టర్ రావ్: యెన్నాళ్లకు కనపడ్డావురా:", అంటూ, తన ఇల్లాలితో "సుశీలా, నా బాల్య మిత్రుడు" అని యింట్రడ్యూస్ చేశాడు మా రాంబాబు. ఆ ప్రక్కనే యున్న కృష్ణన్‌తో "అరేయ్! మా సూర్యం భలే తెలివైందిరా" అన్నాడు తడుముకోకుండా. ఆమెకు తిరిగి గుడ్‌మార్నింగ్ చెపుతూ లోనికెళ్లి టేబుల్సు దగ్గర కుర్చీలో కూర్చున్నారు. నాకూ వాళ్ల ప్రక్కనే సీటిచ్చారు. వయ్యారంగా వడ్డిస్తున్న పెండ్లికూతురుతో "యింకా శేమ్యా తేలేదేం విశాలా", అన్నాడు పెళ్లికొడుకు దూరాన్నుంచి— రావూ కృష్ణను లొకరిముఖాలొకరు చూచుకొన్నారు. నేనూ అటుతిరిగా. 'అందం, చందం, చదువూ, సంఫ్య—అన్నీవున్న పిల్లదొరకినందుకు మనవాడదృష్టవంతుడే కాని వాడి మెదడుకు మాత్రం కొంచెం మేతతక్కువైందని అనకతప్పదురా' అన్నాడు కృష్ణన్. 'లేకపోతే, వాడి మిస్సెస్‌ను ఒకరితో—'సుశీలా' అని యింకొకరితో 'సూర్యం' అని మరొకరితో 'విశాల' అని రకరకాలుగా చెప్పేదేం?' అన్నాడు రావు. "సరే! ముందు విందారగించండోయ్! తర్వాతంతా చెప్తా"అన్నా ...... అందరూ నా చుట్టూ తివాచీమీద ఆసీనులై ఆతృతగా వున్నారు.

"పుష్పరాజిత శాఖలు ఉల్లాసంతో గాలికి మెల్లమెల్లగా అల్లలాడుతున్నాయి. బంగారు మలామాచేసినట్లున్న ఆ సంధ్యాకాలపు యెండలో వాటికొక నూతనశోభ ప్రసరితమైంది. పల్లెటూరి పిల్లకాయలు మహిష వాహనారూఢులై తమతమ పశుబృందమును యిండ్లకు మళ్ళేసుకు

వస్తున్నారు. దారికడ్డముపడుకున్న కాలభైరవ సంతతి కంగారు గాలేస్తున్నాయి. రోడ్డు కిరుప్రక్కలా ఉన్న యిళ్లూ, మేడలు వెనక్కి పరుగులెడుతున్నాయి. వెనుక సీటులో కూర్చున్న మన కృష్ణశాస్త్రిగారబ్బాయి మానసం—మా బస్సు వేగం హెచ్చినకొద్దీ, ఆలోచనా వీచికలతో పైకి క్రిందికి కుదేస్తున్నట్లుంది. అందేం చిత్రమో! ఆ వాలకం చూస్తే మొదటినుంచీకూడ నాకేం అర్థంకావటంలేదు. ఐదు నిమిషాలకోమాటు బోనులోపడ్డ యెలుకలా అటూయిటూ చూడ్డం—తమాషాగా తనలోతానేదో గొణుక్కోవడం జరుగుతూంటేది. 'ఏమిటా?' అనే అనుమానం ఎవరికిరాదు?

కారు ఆగింది; కూలీ, రిక్షావాళ్ల నినాదాలు—అనర్సాపురం కారుస్టాండులో ఏకస్వరంగా ప్రతిధ్వనించేటప్పటికి చెవులుగింగురుమన్నాయి. నా దృష్టంతా 'రాంబాబు' మీదేపడింది. సినీమాకి టైమయినా నా కెందుకో వెళ్లబుద్ధికాలేదు. మూటాముల్లీ దింపుకొని, రిక్షాలో రామాలయం ప్రక్కనున్నభీమేశ్వర సత్రంకి అతడు చేరుకొనేలోగా నేనూ అందుకొన్నా. కనుచీకటప్పుడప్పుడే పడుచుండుటచే సరిగా మనిషిని గుర్తుపట్టడానికికూడ కష్టముగా వున్నది. మనవాడి సూట్కూ, బూటూ చూచి చతుర్ముఖ పురాణం అధ్యయనం చేస్తున్న సత్రంగుమస్తా ఆత్రంతో చక్కావచ్చాడు. మనవాడు 'కుటుంబంతో వచ్చాననడం, 25 నెం గది ఖాళీ' అనడం ఒకేమారు విన్పించాయ్. 'ఏమిటీ! కుటుంబం! యిదేదో చిదంబర రహస్యంలాఉంది' అనుకున్నా. సామానంతా లోపల పెట్టుకొని స్వంతతాళం బిగించి, రాంబాబు కారుస్టాండుకు నేరుగా వచ్చి, వచ్చిన ప్రతిబస్సునూ గాలిస్తున్నాడు. కాస్సేపటికల్లా ముఖంలో నిస్పృహ తాండవమాడుతోందని గ్రహించా. విసుగ్గా రోడ్డుమీద పచార్లు కొడుతున్నాడు, సిగిరెట్ పొగ వదుల్తూ. లాస్టుకారాగేటప్పటికి చేటంత ముఖంతో లోపలనుంచి ఓ చేతి అల్లికసంచి అందుకున్నాడు. అందులోనుంచి దిగిన ఓ అందాలసుందరి టిప్‌టాప్ గా యితని చేతిలోని సంచిని తీసుకుంది. 'త్వరగానడు! అన్నీ సిద్ధంచేశా.' అన్నాడు యెంతో కలుపుగోలుతనంగా. వెనుదిరిగిన ప్రొద్దుతిరుగుడు పువ్వులా

ఆ పిల్ల అటువైపు తిరిగి మాటైనా మాట్లాడందే:— అతని మాటలన్నీ ఏ బండజాతికో:— సినీమాల్లో మనుష్యులను మాయంచేసే కోటును నేను తొడుక్కున్నానంటే నమ్మండి: పాపం— కాళ్ళు లాగేటట్లు నిలబడి కళ్లప్ప చెప్పాడు! ఏంచేస్తాడు? మాట్లాడితేగా!

ఎదురుగావున్న మల్లెపూల దుకాణందగ్గఱ పూలు బేరమాడడం చూచీ చూడనట్లు నటించి ప్రక్కనున్న పల్లెటూరికి బేరమాడి, గుఱ్ఱపు బండెక్కి తుఱ్ఱుమంది ఆ అమ్మాయి. ఇంకేముంది. రాంబాబు నీరై పోయాడు! పాపం—లోనున్న తాపం, కోపం ఒకేమాటు పైకి లేచాయి. కంగారుపడితే కథ అడ్డంతిరగదూ? వెంటనే వేగంగా పరిగెత్తే యింకో గుఱ్ఱపుబండెక్కి గేలాపుతీయించాడు. నేనుమాత్రం వూరుకుంటానా? ఓ అద్దెసైకిలెక్కా. ముందుబండికి కొంచెందూరంలో నడుస్తోంది వెనకాలబండి. ఐదోమైలు రాయిపైనున్న అంకెను, ఆ వూరి పేరున్న బోర్డును నా చేతిలైటు స్పష్టీకరించింది. ఆ అచ్చంపేట పొలిమేర చెఱువుదగ్గరే ముందు బండివాడు ఆపి, కిరాయితీసుకు తోలుకుపోతున్నాడు. ఎలాగో రాంబాబు ముందడుగిడి, దారికడ్డంగా నిలబడి, "సూర్యం! ఎందుకింతకోపం! అసలుసంగతేమిటో చెప్పవా?" అని ఆవేశంతో ప్రశ్నలవర్షం కురిపిస్తుంటే—'ఏదో పాతపరిచయం కూడ వుండొచ్చు', అనుకున్నా. నన్నెవరైనా చూస్తారేమో అని నా గుండెలు దడదడ కొట్టుకొన్నాయ్!

ఇంతకీ చెప్పేదేమంటే — ఎంత ప్రాధేయపడినా — బెల్లంకొట్టిన రాయిలా మాట్లాడక, పలాయనమంత్రం వేసి, కనుచూపుమేరలో కనబడే వూరిగుడిసెలచెంత మటుమాయమైంది మగువ! అబ్బ! మా రాంబాబునుచూస్తే నాకే జాలేసింది. నడవలేనిస్థితితో-చెప్పలేని ఆత్రంతో-తడియారిన పెదవులతో—రసమిసుమంతైనలేని నీరసంతో—జేరవేశాడు శరీరాన్ని బండిలోనికి......ఏమీ యెరుగనట్లు, వాడు బండి దిగేటప్పటికల్లా ఆ సత్రంలో యెదుటపడ్డా. నన్ను చూచేసరికప్పుడెందుకో వాడికి కొంచెంబలంవచ్చినట్టనిపించింది. తాళం నేనే తీశా!

చూస్తినిగదా! గదిలో ఉన్న స్వీట్లపొట్లాలకెన్నో చీమల పుట్టలు పట్టి ఉన్నాయి. తుడుస్తూండగా నాకో 'ట్రూ కాపీవుత్తరం' దొరికింది. ఇది గమనిస్తూ నిరాశగా ఊరుకున్నాడు. అందులో ఇలా వుంది—

"ప్రియమైన సూర్యం".

"నీ పేరు మార్చి పిలుచుకోనిచ్చావు. నువు వ్రాసినప్రకారం యింటరులో నీ జీతం నేనే కడతా. 'నీవు కోరేదీ — నేను కోరేదీ ఒకటే,' అన్నావు. ఆ పంక్తిని పదిసారులు అయినా చదివా. ఎన్ని ఆటంకాలెదుర్కొన్నా — సంఘానికి మార్గదర్శకులై సంస్కర్తలనిపించుకొందాం. మనతొట్రుపాటులేని సంసారం సాటిలేనిదవుతుందని ఆశిస్తున్నా. నువ్వన్నప్రకారం తప్పక ముందే నర్సాపురంచేరి నీ రాకకెదురు చూస్తూవుంటా. మేరేజి రిజిష్టరు కన్నీ సిద్ధంచేశా. నువు నా కులం కాకపోయినా—నీ రూపం-నీ చదువు-నీ వ్రాతలు-నన్ను జయించాయి."

ఇట్లు

నీ 'రాంబాబు'

ఆరి దీని తస్సాదియ్యా! ఎందర్నిలా మోసం చేస్తోందో? అని నేనంటుంటే మనవాడు కొయ్యబొమ్మలాగైపోయి, 'నమ్మి నాలుగు వందలుకూడా తగలేశా' అన్నాడు పెదవివిరచిన తడికళ్ళతో—

గడియారం టంగున నాలుగుకొట్టింది. దాసీవాళ్ల చీపుళ్ల చప్పుళ్లు మా చెవుల బడ్డాయి. 'నీతోపాటే బియ్యే పట్టాపొందిన సుదర్శనాన్ని పిల్ల పెళ్లాడబోతూంటే - నీ కలానికిచ్చిన శ్రమ యెందుకు వృథా కాదు?' అన్నా...... 'ఆ సుదర్శనాన్నా! చేతకాని దద్దమ్మలై ఊరుకోక, దీని అంతమేమిటో సాంతంగా చూచితీరాలి. అరెయ్! నన్నెంతగా ప్రేమించిందని చెప్పిందనుకున్నావ్!' అన్నాడు అదోయిదిగా—

రాంబాబు నాకు ఓ వేలు విడిచిన మేనమామ కొడుకులెండి. చిన్నప్పటినుంచీ వాళ్లయింట్లో నేమ పెరిగి, చదవడంచేత ఆపట్టుదల నాలో కూడా హెచ్చిందనడంలో అతిశయోక్తి యేముంది? జువ్వలపాలెం

బస్సెక్కి మర్నాడు పదింటికల్లా అగ్రహారంలోనున్న 'సుదర్శనం' యింటికివెళ్ళేసరికి మా కళ్లని మే మేనమ్మలేకపోయాం! కాలుకాలిన పిల్లిలా కంగారుపడుతూ, దొడ్డిదారి వెతకుతున్న సూర్యాన్ని జుట్టుపట్టి లాక్కొచ్చి చటచటా చెంపలు వాయించాడు రౌద్రాకారంతో రాంబాబు! 'ఓహో! యేదో కుంభకోణముందన్నమాట - లేకపోతే "సూర్యం' తనపేరుమార్చి 'విశాల' అనటమేమిటి? అంటూ డ్రాయరు పొరుగులోంచితీసిన ఓ ఉత్తరం చూపెట్టాడు సుదర్శనం. అందులో స్కూలుఫైనలు క్లాసుకు జీతంకట్టి పరీక్షపాస్యాసుచేయించినందులకు సుదర్శనాన్నికూడ 'రిజిష్టరుమేరేజి' చేసుకుంటానని వుంది. నా తక్షణ వీక్షణాలు 'సుదర్శనం' మీదపడేసరికి---' వీరు, విశాలా, ఒకేక్షణంలో వచ్చారు 'అని హఠాత్తుగా అన్నాడు!

ఈ రభస, కోలాహలం ప్రక్కింటికికూడ వినపడేవుంటుంది—చుట్టం చూపుగా వచ్చిన పొరుగూరాయనొకరు మాకడకొచ్చి, బాగాపరకాయించి 'విశాలా'ని కేసి తిరిగి 'ఓ సుశీలా?!, రాజమండ్రీ బ్యాంకులో పనిచేస్తున్న 'శ్యాం' కీ నీకూ వివాహమని శుభలేఖ పంపాడు; ఇక్కడున్నావేం? 'అనేసరికి బిక్కమొహం వేశాడు సుదర్శనం. సూర్యం కళ్లనుండి కన్నీటిబొట్లు క్రిందపడ్డాయి.

అంతటితో వదలిపెట్టక అక్కడున్నవారందర్నీ బండెక్కించి రాజమండ్రీ చేర్చాడు రాంబాబు. అంతా ఆశ్చర్యపడుతున్నారు. పెళ్లికి పిల్లతోతల్లివచ్చారని గౌరవ మర్యాదలతో లోని కాహ్వానించాడు 'శ్యాం'. ఇంకా సరిగా లోపలికెళ్ళారోలేదో కాని మళ్లీ బడితిబాజా వాయించాడు మనవాడు.

సంగతంతావిన్న 'శ్యాం' నిర్ఘాంతపోయి, సుశీల తనకు వ్రాసినలేఖలు, 8 రోజులక్రితం యిచ్చిన టెలిగ్రాం యెదుట పెట్టాడు. క్రొత్తవ్యక్తి అందుకొని, "Be Ready-Register-Marriage-Coming soon" (రిజిష్టరు మేరేజికి సిద్ధంగావుండు 'సుశీల') అని చదివాడు. అది వింటూ ఆగమన్నా ఆగక మళ్లీ చెయ్యిచేసుకొన్నాడు రాంబాబు. ఆ దెబ్బతో ఉన్నసంగతి చెప్పింది 'సుశీల'.

'తానొక బస్తీపిల్లగా పెరిగి యిప్పుడు పల్లెటూరి జీవనానికి తోచక, సరదాగా వ్రాసినవ్రాతల మజా తెలియక అట్లుచేసితిననియు, తన శీలాన్ని యేమాత్రం శంకింపరా'దనియు, పశ్చాత్తప్త మనస్కురాలై వెక్కి-వెక్కి యేడుస్తూ రాంబాబు కాళ్లమీద పడింది. 'నీ యిష్టంవచ్చిన వారిని పెళ్లాడు: ' అని కసిరేశాడు కోపంగా---

'సుదర్శనం, శ్యాం' లు 'భగవంతుని పరిముఖంగా ఉత్తరాల పరిచయమే తమ నిలాబిత్తర చేసిందనియు, అంతకుతప్ప వారికేమీ తెల్వదనియు, ఆమెను సోదరిగా ప్రేమింతుమనియు రాంబాబును శంకింపక పెండ్లియాడమనియు', ఏకకంఠంగా అన్నారు. అనుమానం తీరింది. 'శ్యాం' కోరికపై అతని గృహమే కళ్యాణమంటపం అయింది. 'ఆ పెళ్లి కూతురే యీ అమ్మాయి' తర్వాత కథ మీకే తెల్సుగా—'' అని వ్రాయనున్నా...

''అసలు సంగతి అదా!!'' అంటూ మా మిత్రులంతా కిల్లీ లేసుకు మరీ వెళ్లారు

'రావు'

# స్వయంవరం

రాజారావు పల్లెటూరిలో పుట్టి పెరిగాడు. ఒక్కగాక ఒక్క కొడుకు — తల్లిదండ్రులు అతిగారాబంగా పెంచారు. చక్కగా చదువు కుంటూ ఇంట్లో పనులు చూసుకుంటూ నలుగురిచేతా మంచివాడనిపించు కున్నాడు. వాళ్ల దాక చిన్నసంసారం. ఆరెకరాలమాగాణి ఉంది. అయిదవ ఫారం ప్యాసయాడు - స్కూలు ఫైనల్ చదవడానికి పది మైళ్లదూరంలో ఉన్న పట్నంలో మకాం పెట్టాడు. ఒక గది అద్దెకు తీసుకుని ఉంటున్నాడు. భోజనం హోటల్లో.

సరోజ పెద్ద కుటుంబానికి చెందిన పిల్ల. ఆదగ్గర్లో ఏదో ఊరినుంచి వచ్చి ఇక్కడ చదువుకుంటోంది. ప్రథమ దర్శనంలోనే ఆమె రాజా రావు అందచందాలకు ముగ్ధురాలయింది. అందులో, రాజారావు క్లాసులో ఎప్పుడూ ఫస్టు. సరోజ ఎలాగైనా అతనితో పరిచయం చేసుకో వాలని ప్రయత్నించింది. కాని క్లాసులో మాట్లాడటం ఎల్లాసంభవమవు తుంది? ఆమె సమయానికి ఎదురుచూస్తూన్నది.

రాజారావు టీచర్లలోను స్టూడెంట్సులోనూ కూడ మంచి పలుకుబడి సంపాదించుకున్నాడు. ఎస్. పి. ఎల్. ఎలక్షన్లువచ్చాయి. రాజా రావు పార్టీవాళ్లు అతన్ని నిలిపి గెలిపించడానికి జోరుగా ప్రచారం చేస్తున్నారు. రాజారావు కూడ స్వయంగా కొంతమందిని కలుసుకుని వోట్లు అడుగుతున్నాడు.

ఒకనాడు సాయంత్రం రాజారావు సరోజను ఆమె ఇంటివద్ద కలుసు కున్నాడు, ఆమె సంతోషానికి మేరలేదు. ఒకరితో ఒకరు పరిచయం సంపాదించుకున్నారు - ఎలక్షన్సులో సరోజకూడ రాజారావు పక్షంలో నడుం కట్టిపనిచేసింది. ఎలెక్షన్సుకాగానే రాజారావు ఎన్నిక అయి నట్టు హెడ్మాస్టరు ప్రకటించాడు.

క్వార్టర్లీ పరీక్షలు జరిగిపోయాయి. సెలవుల్లో ప్రైవేటు క్లాసులుండ డంచేత రాజారావు సరోజలు ఇంటికి వెళ్లలేదు. ఇక్కడ వీళ్ల ఇద్దరి మధ్యా స్నేహం దిన దినాభివృద్ధినంద సాగింది. ఆ స్నేహం క్రమ

క్రమంగా దృఢమైన ప్రేమగా మారింది. ఒకళ్లనొకళ్లు పూర్తిగా అర్థం చేసుకోడానికి తగిన అనుకూల పరిస్థితులు కూడ వాళ్లకి లభించాయి. వాళ్ల హృదయాలు ఏకమవడానికి ఎంతో సమయం పట్టలేదు.

ప్రతిదినం సరోజ రాజారావు రూమ్‌కివచ్చి కలుసుకునేది. తనకు తెలియని పాఠాలు అతనిచే చెప్పించుకునేది. రాజారావు ఎంతో ఓపికగా ఆమెకి నోట్సు మొదలైనవి రాసి పెడుతూండేవాడు. ఇంత సన్నిహితంగా ఉంటూన్నప్పటికీ ఎవరూ వివాహ విషయం కదల్చుకోలేక పోయారు. వీరి ప్రణయవృత్తాంతం స్కూలు స్టూడెంట్సు ఎల్లా పసిగట్టారో వీరిని లైలామజ్నూలని పిలువసాగారు. కాని రాజారావు సరోజ ఏం లెక్క చెయ్యలేదు.

ఒక రోజున రాజారావు సరోజని జంకుకొంకు లేకుండా 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను - నన్ను పెళ్లి చేసుకుంటావా రోజా?' అని అడిగేశాడు. 'నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను రాజా - నేనై నీకు తెలియజేయలేకపోయాను' అంది సరోజ అతిప్రాంప్టుగా.

'నిజమేనా రోజా!' అన్నాడు రాజారావు ఆత్రుతగా.

'నీతో నేను నోరువిప్పి చెప్పాను కాదా?' అంది సరోజ సిగ్గుపడుతూనే.

రాజారావు ఒక్కసారి ఆమెను అమాంతంగా కౌగలించుకుని ముద్దు పెట్టుకున్నాడు. సిగ్గుతో ఒళ్లు పులకరింప ఆమె అతని ఒడిలో ఇమిడిపోయింది.

అర్థసంవత్సరపు పరీక్షలయ్యాయి. రాజారావు వాళ్ల ఇంటికి జేరుకున్నాడు - సరోజ తన ఊరు వెళ్లిపోయింది. విడిపోయేటప్పుడు ఒకళ్లకొకరు ఉత్తరాలు వ్రాస్తూ ఉండాలని వాగ్దానం చేసుకున్నారు.

రాజారావు రాక తల్లిదండ్రులకి చాలా సంతోషాన్ని కలుగజేసింది. అయితే ఉళ్ళో ఏనోట విన్నా సరోజా రాజారావుల ప్రేమకలాపాలే. సహజంగా వాళ్లు ఒకరినొకరు ప్రేమించుకున్నారే కాని సంఘ విరుద్ధంగా ఎన్నడూ ప్రవర్తించి ఎరుగరు. లోకం 'తీరేఇంత' అని ఊరు

శున్నాడు రాజారావు. వారి పవిత్రప్రణయగాథకి పెడర్థాలు తీసే లోకాన్ని ఏంచేస్తే మాత్రం పాపం ఉంది?

ఒక రోజు రాజారావుకి లెటరువచ్చింది.

'ప్రియమైన రాజా,

నీదగ్గిరినుండి ఉత్తరం రానందుకు హృదయం పరితపిస్తోంది. నీ వక్కడ-నేనిక్కడ! ఎంతకాలం ఈ ఆ వేదన అనుభవించడం? ఇక్కడ పరిస్థితులు బాగులేవు. నాన్నగారికి సంగతి తెలిసింది. ఏ నిమిషానికి ఏం జరుగుతుందో చెప్పలేను. వెంటనే జవాబు వ్రాయి.

నీ 'రోజా.'

రాజారావు ఇలా జవాబు వ్రాశాడు—

'ప్రియమైన నా రోజా,

మనం అనుకున్నదే, పరిస్థితులు ఇల్లా ఉంటాయని. ఎడబాటు పోటుకి నేను ఓర్చుకోలేకున్నాను. వేఱు మార్గంలేదు. మన వివాహానికి అనుకూలవాతావరణం కోసం ప్రతీక్షిద్దాం. ఇది మనకి పరీక్షా సమయం.

నీ రాజా,'

సెలవులు ఇంకా అయిదారు రోజులే ఉన్నాయి. రాజారావు వాళ్ల పిన్నిగారి ఊరు వెళ్లి రెండు రోజులుండి వచ్చాడు. తిరిగి ఇంటికి జేరుకునేటప్పటికి సరోజ లెటరు అతనికోసం ఎదురుచూస్తోంది.

'ప్రియమైన ఓ రాజా,

పరిస్థితులు విషమించాయి-నీ లెటరు మా నాన్న చేతిలోపడింది. ఆయన నన్ను మా మేనత్తకొడుక్కి ఇచ్చి వివాహం, బుధవారం రాత్రికే చెయ్యడానికి నిశ్చయించారు. నివీ ఉత్తరం చూసుకోగానే బయలుదేరి వచ్చేసెయ్ - ని కోసం బుధవారం ఉదయంవరకూ నిరీక్షిస్తూంటాను. మధ్యాహ్నం పన్నెండు గంటలు దాటితే నేనింకనీకే కాదు—లోకంలో ఎవరికీ కనిపించను. ఇక్కడికి నువ్వురాగానే ఎవరినీ లక్ష్యపెట్టకుండా నీతోవచ్చేస్తాను- బెజవాడ వెళ్లి తక్షణం రిజిష్టరు మ్యారేజి చేసుకుందాం. నీ రాజా.'

ఉత్తరం చదివి రాజారావు స్తంభితుడై పోయాడు. ఈ నాడే బుధవారం - అప్పటి కప్పుడే 8 గంటలయింది - ఎనిమిదిన్నర ప్యాసింజర్ మీద బయలుదేరి వెడితే పదకొండు గంటలకే సరోజ ఉన్న ఊరు చేరుకోవచ్చు - బెజవాడ అర్జంటు పనిమీద వెడుతున్నాననీ రేపు వస్తాననీ తండ్రితో చెప్పాడు. రాజారావు తండ్రి అతని వీపు చేత్తో తట్టుతూ 'నాయనా, నీవు కంగారు పడద్దు - మీరు చెడ్డపని ఏమీ చెయ్యడం లేదు - భగవంతుడు తప్పక మీకు సహాయపడతాడు - ఇదిగో, కోడలికి నా కానుక అందజెయ్యి, అని చెపుతూ అతని చేతిలో వందరూపాయిల కాగితం ఒకటి పెట్టాడు.' రిజిస్టరు చేయించుకోగానే ఇద్దరూ కలిసి ఇక్కడికి వచ్చేయ్యండి - మీ మంచికోరేవాడను నేనిక్కడ ఉన్నానన్న సంగతి మరచిపోకండి. అమ్మాయితో ఈ సంగతి చెప్పు,'- అంటూ ఆయన అతన్ని స్టేషనుదాకా వచ్చి సాగనంపాడు.

బెజవాడలో సరోజా రాజారావుల రిజిస్టరు మ్యారేజి అతి క్లుప్తంగా జరిగిపోయింది. మామగారి ఉదారతను తలచుకుని ఆ ఆనంద సమయంలో సరోజ రెండు కన్నీటి చుక్కలు రాల్చింది.

'స్థానం ముత్తుకుమార్'

# నా కథ

వినండి - వినకపోండి, నా కథ చెప్పాల్సింది నావిధి. చిన్నప్పుడే అమ్మవారుపోసి నా రెండు కళ్లూ పోయాయి. అది మొదలు అమ్మ నిత్యమూ ఊరిలోని దేవాలయానికి నన్నుతీసుకునిపోయి ప్రదక్షిణాలు చేస్తూఉండేది, నన్ను చంకనిపెట్టుకుని. అమ్మవారి సన్నిధిని ఇదే మా అనుశృతమైన నిత్యకృత్యం.

ప్రదక్షిణాలు కాగానే నన్ను దేవీ పాదపద్మముల చెంతజేర్చి నమస్కారం చేయించేది. అదే సమయంలో అర్చకుడు నన్ను తన నిండు చేతుల్లో తీసుకుని ఒళ్లంతానిమిరి మా అమ్మచేతికి ఇచ్చేస్తూండేవాడు.

ఊళ్లోవాళ్లంతా అమ్మవారుపోసి పోయిన కళ్లు ఇంక రావన్నారు. అదేమో, నాకు అంత చిన్నతనంలోనే, అమ్మవారి కరుణవల్ల, అర్చకునిచేతుల్లో ఉన్నంత సేపూ కళ్లు - కాదు చూపు వచ్చినట్లుండేది. ఆక్షణం దాటగానే అది భ్రాంతి అని అనుకునేదాన్ని - మళ్లీ మర్నాడు ప్రత్యూషపవనోత్ఫుల్ల పుండరీక సౌగంధలహరీ తరంగ పరిష్వంగాంగకములతో అర్చకునిచేతులలో రోమాంచితనై తన్మయత్వమునందేవరకు. నేను అనాథగా ఉండిపోతానేమో అని మా అమ్మ భయం. ఈ హృదయావేదనతో కొట్టుకునే మా అమ్మస్థితి భరింపరానిదిగా ఉండేది. నన్ను చంకనిపెట్టుకుని గర్భగుడిచుట్టూ ప్రదక్షిణంచేస్తూన్నంత సేపూ ఆమె గుండెకొట్టుకోడం నాకు తెలుస్తూండేది. అందుకనే అర్చకుని చేతుల్లో లాలింపబడేది ఎప్పుడెప్పుడా అని రెప్పవేయని నా గ్రుడ్డి కళ్లు ఎదురు చూస్తూండేవి. అందుచేతే అమ్మవారికి ప్రదక్షిణం తిరిగేంతవరకూ గుక్కపట్టి ఏడుస్తూండేదాన్ని. గుడిలో తలక్రిందుగా తపసించే గబ్బిలాలు తబ్బిబ్బులయి నన్ను తలపై మొట్టిపోతూండేవి.

అందరాని ఫలమై పోతానేమోనని అర్చకుని ఆరాటం. అందుకే అతడు నన్ను గట్టిగా పట్టుకునేవాడు. అర్చకుడు ఆరాటంలో వదిలే నిప్పుసెగలవంటి ఊర్పులలో కమిలిపోయేవి నా ప్రాణాలు. అతని చేతుల్లోని గట్టిపట్టు ఎక్కడ తప్పిపోతుందోనని ఏడ్చేదాన్ని. అతనిలో అణగి ఉన్న ఏదో అర్థంగాని భయంకరావేగాన్ని - అగ్ని పర్వతార్భ

టాన్ని వచ్చీరాని చూపులతో చూసి భరించలేక భయపడేదాన్ని. అంధగానే ఉండిపోవాలనే పిరికి బుద్ధితో మళ్లీ అమ్మ అంకానికే అళపడేదాన్ని.

అమ్మది ఏమి అనుపక్తమో అర్చకునిది ఏమి అనుష్ఠానమో ఎవరికీ బోధపడేదికాదు. నాకథ చెప్పడానికి ఇదే మూలకారణం. నేను అమ్మ స్తన్యజన్య ఫీయూషధారాప్లుతహాలాహలము త్రాగలేకుండా ఉండేదాన్ని. మరో, అర్చకుని అగ్నిపర్వత శిఖరాశీస్సుమవిస్ఫులింగాల్ని జడముడువలేకుండ ఉండేదాన్ని.

అంధగా అందంగా పెరుగుతూవచ్చా. అజ్ఞానంలోనే విజ్ఞానం సముపార్జించుకున్నా. చీకటిలోని దీపికగా తీర్పులోని ఓర్పుగా అంధకి అందంగా నాలో యౌవనం వికసించింది.

నా అవయవాలలో అందం అమరింది - ఇమిడింది. అమ్మ భయంతో తొణికిసలాడింది. అర్చకుడికి ఆరాటం హెచ్చింది. అమ్మ సంకలో సౌఖ్యంలేదు - అర్చకుని చేతుల్లో ఆనందంలేదు.

'నాణ్యంగా నల్లగాడేవి కనుబొమలని మరపించేవి నా కనుబొమలు' అనే అర్చకుని మాటల్లో నగ్నసత్యం నాట్యంచేసింది. నా కనుబొమలు నల్లగానగ్నంగా నా కళ్ళకు కట్టేవి.

'గాజు పెంకులవలె నీలాకాశంగా శూన్యంగా ఉన్నాయి,' అని అనుకునే అమ్మ మాటల్లో నా కనుగ్రుడ్లు నా చ్యుతపారిజాతనూన సౌరభ సంకలిత సౌఖ్యత రంగితాంతరంగానికి ఎగతట్టుతూండేవి.

నాకు తెలియకుండా ఒకనాడు అమ్మ ఎందుకో బాధపడుతూన్నట్లుగా నాకుతోచింది. దేవీసన్నిధిని అర్చకుని చేతుల్లో నలిగినప్పుడు ఎందుకో అమ్మతో అతడూ ఆరాటపడుతున్నాడన్న సంగతి చెప్పాలనుకున్నాను. కాని చెప్పలేకపోయాను. చెప్పలేకపోయానే అని ఇప్పటికీ అనుకుంటూనే ఉన్నా.

ఎందుకు అమ్మ అల్లా భయపడింది - అర్చకుడు ఎందుకు ఆవిధంగా ఆరాటపడింది; ఇప్పుడిప్పుడే, వికసించే కమలాల్లో - విహసించే కమలాక్షుల్లో - ముకుళించే కుముదాల్లో - కుంచించే కుటిలాక్షుల్లో నాక వగత మైంది.

ఊరంతా పుట్టాయి ఏవేవో పుకార్లు. ఉబుసుపోని ఉత్తుత్తిమాటలు. ఉత్తపుణ్యానికే అంటకట్టారు ఊసరవెల్లి పాపాన్ని. అంతా నన్ను ఎగాదిగా చూసేవారే - వాళ్ల చూపులకి అందని నా చూపుకోసం. అసలు చూపు ఉంటేనా? రూపు ఉంటేనా? అనుకునే వారు నా చూపుసంగతే తెలియనివారు - నా రూపుసంగతే ఎరుగనివారు. దేవీ సన్నిధిలో అర్చకునిచేతుల్లోనే నాకు చూపని - అంతే - తిరిగి మరుక్షణంలోనే శూన్యమని తెలీదు పాపం!

ఆదినం! అంటే - అమ్మచెయ్యి పట్టుకుని నేను స్వయంగా నా కాళ్లతో దేవీ సన్నిధికి నడిచి వెళ్ళిన నాటి సంగతి - దారినిపోయే వాళ్లంతా నాకేసి చూస్తూ నిలబడిపోయిన నాటి చరిత్ర - పూవులలోని వలపులు గాలి కాళ్లతో నాకై పరువులెత్తిన ఆనాటి కథ!

నా గతి ఏమని అమ్మ నిలబడింది దేవీ చరణపద్మసవిధమున. నా సంగతి ఏమని అర్చకుడు ఆగిపోయిన హృత్తంత్రులతో ప్రశ్నిస్తూ స్తంభాకృతిలో నిలబడినాడు దేవీసన్నిధిని. అమ్మ చేయిపట్టుకుని నేను ఇంటి దారి పట్టాను.

ప్రొద్దు తిరిగింది - చీకటిపడింది చినుకులతో. అమ్మకళ్ళు నీళ్ళతో నిండాయి. అర్చకుని గుండెలు గుడిగంటలై నా చెవుల్లో గింగిరు మన్నవి. రజనీకన్య ఆకాశ నీలాంబరం కప్పుకుని తన నక్షత్రసహస్ర నేత్రాలతో వెదకడం మొదలు పెట్టింది నా చూపు.

ఆ దినం అర్చకుడు నన్ను తన చేతుల్లోకి తీసుకోలేదు. అమ్మ చంకని పెట్టుకుని ఇంటికిపోనూలేదు. ఏదో నా గుండెల్లో భారంగా

తో చింది. నాకు తెలియకుండానే ఏదో దూరదేశప్రయాణానికి, ఏదో అంతు పొంతు లేని శూన్యంలోని చూపులకి నా ఒళ్ళు వెర్రెత్తిపోయింది.

అమ్మ నా చూపు విఫలమని విలపించింది. అర్చకుడు నా చాపు అందలేదని రోధించాడు. ఊరంతా నను చుట్టేసి నా అంత్య క్రియలకి ఆసరా అయారు.

ప్రతిదినం ప్రాతఃసంధ్యల శ్మశానానికి వచ్చి అమ్మ నాకై ఒక కన్నీటి బొట్టు రాలుస్తూ ఉంటుంది. నా యెదుట మోకరిల్లి దోసిలిలోని పూలు విడుస్తూ ఉంటాడు అర్చకుడు.

అనాధగా ఉండిపోయాననే అమ్మ భయంలో నా అస్తులు అలమటిస్తూ ఉంటాయి. అందరాని ఫలమై పోయాననే అర్చకుని నిస్పృహాలో నివదిస్తూ ఉంటుంది కుసుమింపని నా ఎద! ఇదే నా కథ!

'గోసురాపంత్'

# తమ్ముడి కోసం

గడ్డం బాగా పెరిగిపోయి, చిరిగిపోయిన బట్టలతో తనకన్నా మూడు నాలుగు సంవత్సరాల చిన్నవయస్సువాడైన తమ్ముణ్ణి రామకోటిని చూడగానే కడుపు తరుక్కుపోయి గట్టిగా కౌగలించికొని పసిపిల్లవానివలె విలపించాడు, గోపాలకృష్ణయ్య. ఎన్ని సంవత్సరాలో అన్నగారి ఆస్తిని కాజెయ్యాలని కోర్టులో వేసిన దావాలు; ఆ దావాలు మూలంగా వదినగారిని, పిల్లలనుకూడా చంపడానికి ప్రయత్నం చేసిన ప్పటికి తమ్ముడు చేసిన అప్పులు ఖైదుపాలవడానికి దారితీసినవని తెలియగానే వచ్చిన రెండువందల రూపాయల జీతం తీసుకొని విన్నరోజునే బయల్దేరాడు.

గోపాలకృష్ణయ్య వదినగారి దుఃఖానికి అంతులేదు. మామగారు, అత్తగారు పూర్వకాలపు మనుషులు. తెల్లనివన్నీపాలు, నల్లనివన్నీనీళ్ళు అనుకు నేరకపువాళ్ళను కనిపెడ్తూ చిన్నతనంలోనే పసుపు కుంకుమ పోగొట్టుకున్న అభాగ్యురాలు. మరదులిద్దర్నీ పెంచి పెద్ద చేసింది. పెద్దమరదికి ఇద్దరు కొడుకులు పుట్టగానే తన్మయురాలైనది, ఒకణ్ణి తను దత్తత చేసుకోవచ్చునని.

చిన్నమరది బంధువులలో ఓకరికి దత్తత ఈయబడ్డాడు. 18వ ఏటనే మునిసిపాలిటిలో జనన మరణ రిజిస్ట్రారుగా కుదిరేడు. కాని పిల్లలు లేరు. మరదలు కూతుర్ని భార్య బలవంతంచేత పెంచాడు. పెంపుడువల్ల గారాబం ఆమె జీవితాన్ని నాశనంచేసింది. భయభక్తులు, మంచి, చెడ్డలు నశించినాయి. ఏవీధిలోచూచినా ఆ అమ్మాయే. చివరకు పెంపుడు తల్లికీ విసుగుపుట్టింది. బుద్ధి రావడానికి వాతలు పెట్టింది. వివాహవయస్సు రాగానే పెళ్ళిప్రయత్నం చేయమని పోరు పెట్టింది.

లేనిచోట్ల తగాదాలు పెట్టించికోర్టుకెక్కించి ఒక పక్షంవైపుచేరి కోర్టు వ్యవహారాలలో తిరిగేవాడు. దిక్కులేని ములసమ్మ కాశీకెళ్ళితే ఆమె

ఆస్తి తనకున్న అప్పు క్రిందరావాలని కోర్టులో పిటీషను దాఖలుచేసి వున్న కొంచెము పైకము ఖర్చుపెట్టటమేగాక అప్పులు తెచ్చేవాడు. ఆస్తి అన్యాక్రాంతమైనవారు 'రామకోటీ' వచ్చినదాంట్లో నీకు కొంత భాగము ఇస్తాము కోర్టుపని చూడరా' అంటే పరమానందభరితుడై ఉద్యోగాన్నికూడా నిర్లక్ష్యించి కోర్టులకు, ఇంటికి తిరిగేవాడు.

ఇన్స్పెక్షన్ దగ్గరకొచ్చేటప్పుడు అభినవచిత్రగుప్తుడై, చచ్చినవారిని పుట్టినవారి కాతానూ, పుట్టినవారిని చచ్చినవారి జాబితనూ ఎక్కించే వాడు. కొన్ని అసలు చేర్చేవాడుకాడు. కోర్టు ఖర్చులకు డబ్బు ఖర్చు కాగా దొంగ సర్టిఫికేట్లు సృష్టించి ఫోర్జరీలు చేయడానికికూడాసాహసించాడు.

ఒకసారి ఒక ముసలమ్మ కాశీకి వెళ్ళగానే, ఆమె వారసులు ఆమె చచ్చిపోయిందని సర్టిఫికేటు ఇయ్యమని అడిగేరు, రెండు-పచ్చ కాగితాలు అందిస్తూ. హైకోర్టుకు రెండు కేసులొచ్చినాయి—సమయానికి ఉపయోగపడినందుకు ఆనందభరితుడయ్యాడు. గుంటూరు ఆంధ్రా హైకోర్టులో చచ్చిపోయిన ముసలమ్మ తనకు బాకీవున్నదని, దానికిగానుతనకు 40,000 రూపాయల ఆస్తి చెందాలని, పెట్టిన పిటీషను వారసుల న్యాయనిరూపణద్వారా కొట్టి వేశారు. భార్యపేరట ఆస్తివ్రాసి, తనపేర తాకట్టుపెట్టి వడ్డీకి తెచ్చుకొని తీర్చలేక పోయినందున, వేసిన దావా నోటీసు చేతికందగానే శరీరకంపనము ప్రారంభమైనది.

మెల్లగా అన్నగారిని, అన్నగారి పిల్లలను పలుకరించడం, గుంటూరు వచ్చి వాళ్ళింట్లోవుండి వెళ్ళడము మొదలుపెట్టేడు. నాలుగైదువేల అప్పులు తేలినాయి. పెంపుడు కూతురు పెళ్ళి సంబంధం కోసముకూడా మోసంతోనే మొదలు పెట్టేడు. గుంటూరు ఏ. సి. కాలేజిలో B. Com. చదివేపిల్లవాడి తండ్రికి తన ఆస్తి అంతా పిల్లకు వ్రాసిస్తానని తన పెంపుడు తల్లి ఆస్తి అంతాకూడా ఆ అమ్మాయికే వస్తుందని చెప్ప

గానే M. Com. చదువవచ్చునవే ఆశలోవున్న ఆ పిల్లవాడు; అంత మంచి సంబంధం దొరికిందిగదా అని ఆ పిల్లవాడి తండ్రి సంతోషించారు. పిల్ల అందాన్నికూడా చూడలేదు. దొంగ వీలునామాలు సృష్టించివారిని నమ్మించాడు. పెళ్ళికాగానే M. Com కు వెళ్ళాలని ముచ్చట పడు తున్న అల్లుడు B. Com 1st Class ప్యాసయ్యాడని తెలుసుకోగానే వియ్యంకుడు డబ్బుకోసం వత్తిడి చేయసాగేడు. పెళ్ళికి రెండు వేలు తాకట్టుపెట్టి అప్పుదెచ్చిన రామకోటి నాల్గువందలు చేతులోపెట్టి కాలేజిలో చేరేటప్పుడు ఇస్తానన్నాడు. వియ్యంకుడికి అనుమాన మొచ్చింది. కాలేజిలు తెరిచేటప్పటికి రామకోటి ఊళ్ళోలేకుండా వెళ్ళిపోయాడు. వియ్యంకుడు ఇంటికొచ్చి నానాతిట్లు తిట్టివెళ్ళేడు. తన కొడుకుతో కాపరం పెట్టడం తన బొందిలో ప్రాణంవున్నంతవరకు జరగదన్నాడు. రామకోటి, భార్య, కూతురుకూడా ఆయన ఎదుటే 'ముసలాడుచస్తే గాని పిల్లవాడు బాగుపడడు' అన్నారు. దాంతో ఆయన ఆగ్రహావేశుడైనప్పటికి కార్యశూరుడైనందువలన వెనక్కు తిరిగేడు.

కార్యంకోసము రాయభారాలు జరిపేడు. రామకోటి.500 ఇమ్మన్నాడు. డబ్బువుచ్చుకుని నామమాత్రం 'కార్యం'తో వెళ్ళిపోయారు. అల్లుడు తన జీవితాన్ని నరకంగా తయారుచేసిన మామగార్ని చూచి మండిపోయాడు. చిలకలూరిపేట హైస్కూల్లో టీచరుగాచేరేడు. తండ్రి మళ్ళీ పెళ్ళి ప్రయత్నాలు చేయసాగేడు. ఒక్కసారి అదృష్టము ఎదురు తిరుగగా ఒకటివెంబడి ఒకటి కష్టాలు పెరగసాగినాయి. ఏ సమయంలో ఇల్లు జప్తు అవుతుందోనని భార్యను మరదలింటికి పంపేడు, తను ప్రతి స్నేహితుణ్ని ఆశ్రయించసాగాడు. ఈ సంగతి విన్న గోపాలకృష్ణయ్యకు పిచ్చెత్తినట్లయింది. భాతృప్రేమనశించలేదు. అన్నగారేకాదు, ఆఊళ్ళో వాళ్ళంతా 'నలభైవేలరూపాయిల ఆస్తిపరుడికి ఇదేం ఖర్మ?' అని ముక్కుమీద

వేలేసుకుంటున్నారు. అదే 'రోజులు మారాయి' అంటారు వేదాంతులు. వేసుకున్న ప్లానులు, అంచనాలు ఆకాశసౌధాలూ, నేలకూలాయి. గోపాలకృష్ణయ్య అప్పులన్ని కొన్ని తీర్చాడు. మిగతా వారిని తనపలుకు బడిలో కోర్టులోనుండి పిటీషన్లు ఉపసంహరింపచేశాడు. తన అన్నగారి గుణాన్ని గ్రహించాడు - అన్నని - క్షమించు, 'నేను ఎన్నో దుర్మార్గ కార్యాలు చేశాను. నీమీదకూడా కత్తికట్టేను. నా అతి తెలివినన్నే హతమార్చింది. ఈ ఆస్తంతా అప్పులు తీర్చినీవే తీసుకో. నీ మరదల్ను నీ వద్దేవుంచుకొని తిండి పడేయుండి. నేను తీర్థయాత్రకు వెళ్ళిపోతాన'న్న తమ్ముణ్ణి దుఃఖావేశంలో మరింత దగ్గరగా అదుముకుని' - రామకోటి - నేనున్నంతవరకు నన్నువిడిచి మీ రెవరూ వెళ్ళవద్దు. ఇదే నా కోరిక అన్నాడు- ఆనందాశ్రువులు రాలుస్తూ.

' రాజేశ్వరీ రాణి '

# రామిగాడి బండి

'రామిగాడు రాలేదర్రా ?' అని సత్రం ఏజంటు చిన్నసామి అడిగాడు రాజన్నని. రాజన్న తల అడ్డంగావూపి' ఏందో అన్నా! రాలేదే రాముడన్న. ఆఁ — రేతిరి బిడ్డకు బాగలేదని అంటూండినాది ఆడి పెళ్ళాం. ఎట్టావుండాదో 'నేను చూడను పెళ్ళాలను కొంటూబండీ కట్టుక వచ్చేనేను' అన్నాడు బీడీ వెలిగించుకొంటూ. 'పాపం..' అప్రయత్నంగా చిన్నసామి నోటంట వెలువడ్డది. మొదలే దరిద్రుడు. సత్రంలో ఇక వెళ్ళవలసిన ప్రయాణీకు లెవ్వరు లేరు. ఈ నాడు ఆగంజికూడా వుండదు వాడింట' చిన్నసామి ఆలోచించుకొంటూ అరుగుపై కూర్చున్నాడు. 'రామిగాడి ఆకారం చిన్నసామి కండ్లకెదురయింది. ఆ బక్క-చిక్కిన రామిగాడు, 'ఆ చినుగులతో' మోకాలు పైకిగుడ్డ 'ఎట్టది. తలలో పేలిక. చెవిలో కాల్చిపారవేసిన బీడీముక్క ఆవిరిగిపోయినబండీ' రామిగాడికన్నా హీనంగా చిక్కిపోయిన ఆఎద్దు.' ఆ ఎద్దు అప్పుడప్పుడూ కళ్ళనీరు కార్చేది. అది దుఃఖించేది యజమాని స్థితికోసమో: లేక 'ఏమిటో' కానీ ఏనాడూ ఓ అణా అవిశాకు తెచ్చి పెట్టిన పాపం, ఎండు గడ్డివేసిన పాపం లేకపోయినా రామిగాడి దగ్గర అది స్వామి భక్తిగా నేవుండేది. రామిగాడి చేతిలో లాఠీవుండినా ఆ ఎద్దుని కొట్టడు. కొడితే ఆ ఎద్దు అసరాకూడా పోతుందని భయం ఆ ఎద్దే ప్రస్తుతం రామిగాడి జీవనాధారం!

'అందరెల్లిపోయారా నాయనా!'

చిన్నసామి తలెత్తాడు. తాను తలుచుకొంటూన్న ఆ ఆకారం ప్రత్యక్షమయింది. 'ఇంత సేపేమిరా: నీ దరిద్రం నిన్నిలా చేస్తోంది. కొందరు నడచికూడ వెళ్ళిపోయారు. అయినా ఇంత పొద్దెక్కివస్తే ఎట్లరా రామిగా!' అని చిన్నసామి కోపంగా, జాలిగా, ప్రేమగా, అధికారంతో అడిగాడు.

రామిగాడు ఉస్సురన్నాడు.

'నీ బిడ్డకు ఎలావుందిరా?' అన్నాడు మళ్ళీ చిన్నసామి.

రామిగాడు కనుబొమలు దగ్గరగా లాగిచూచి 'రాజన్న చెప్పివుంటాడు బాబయ్యా! ఏంచేత్తానయ్యా; ఆడికి రేతిరినుంచీ ఒక్క పెట్టున జొరంకాత్తోంది. ఇంటిదానికీ ఆ రాగులు సరిపడక ఒక్కటే బేదులు ఏం శేత్తానయ్యా. నాకరమ' అన్నాడు. రామిగాడికి గంపెడు సంసారం. అందులో ఓ బిడ్డకు బాగాలేదు. తామే కూటికి చస్తూవుంటే వాడు చచ్చిపోవడంమేలే కదా! అనవచ్చు కానీ 'కన్న తండ్రి! కడుపారా తన బిడ్డను చంపుకొంటాడా? లోకం అనవచ్చు. కానీ దరిద్రుడికి ఒకపూట గడవడం కష్టమే అయినా బిడ్డల్ని చంపుకొంటాడా! ఆ విషయం మహారాజులకేం తెలుసు? 'నీ బ్రతుకేత్తుణాల మీద వుంది. అందులో నీకొడుకుని బ్రతికించుకోవాలని వృథా ప్రయాసదేనికి: ఒక అంకె తగ్గిపోతేపోనీ 'అంటారు. ఈ సందేహం మధ్యస్థితిలో వున్న చిన్నసామికి కూడావచ్చింది. కానీ నోరుతెరిచి అనలేక పోయాడు. ఇంకొకప్పుడైతే- లేక రామిగాణ్ణి తాను ఎరగకపోయినప్పుడు-అనివుంటాడేమో కానీ 'రామిగాడికి దిన భత్యం తానిప్పిస్తూ వాడి ఇంట్లో దీపం పెట్టాడిప్పుడు. సత్రపు బాడిగలు వాళ్ళని బేరాలు అడుక్కొని బండిలో ఎక్కించేవాడు. వాళ్ళు ఇంకోబండిని మాట్లాడుకొంటే జగడం వేసేవాడు. 'ఏదవాడు వాడి బ్రతుకు కాపాడండి. పాపం మెల్లగా తోసుకొని పోతాడులే' అని రామిగాడివైపున వకల్తాపుచ్చుకొనేవాడు. అప్పుడప్పుడు వాడికి రెండో ఒకటో సాయంచేస్తోవున్నాడు. అయినా తానేం మహారాజుకాడు. ఇటు రామిగాడిస్థితికాదు. మధ్యలో త్రిశంకు స్వర్గంలో ఊగుతున్నాడు.

'డాక్టరుకి చూపించాలంటే రూపాయి అవుద్ది! ఎట్టాగానాయనా! కూడుతినేబిడ్డ రేతిరిఅంతా అంత జొరంలో కూడు కూడంటానే వుండినాడు,' రామిగాడు కళ్ళుతుడుచుకొన్నాడు.

చిన్నసామి జేబులో చేయివేసాడు.

'బండికి ఇరుసుకూడ పోయింది బాబయ్యా,' అయినా ఫరవాలేదు. పిల్లా
డిదే!' రామిగాడు ఆత్రంగా చూసాడు చిన్నసామి జేబువేపు. చిన్న
సామికి ఒకవైపు కష్టంగావున్న 'మరోవైపు ఇదెక్కడి పీడరా' అని
వుంది. తెల్లవారి ఎవరో పుణ్యాత్ములు రూపాయ ఇచ్చారు, అదీ
పిల్లాడి బడిజీతాని కంటే' ఈ సత్రం యాజమాని 15 రూ.లుఇస్తేఅతనికే
మూలకి! ఏదో తరతరాల్నుంచీ వస్తోంది కదా ఈ ఉద్యోగం. మన
మెందుకు కాదనాలి? అని సరిపెట్టుకపోతున్నాడు. ఆరూపాయ
తీసి రామిగాడిచేతుల్లో వేసాడు. రామిగాడు అప్యాయంగా కళ్ళకద్దు
కొన్నాడు. 'మీ రునము ఎప్పటికి తీరుత్తానో నాయనా! నన్ను
రచ్చించావు. నా పిల్లపానం రచ్చించావు. వత్తానాయనా!' అన్నాడు
సంతోషంగా. వాడి జీర్ణమైపోయి శిథిలావస్థలోవున్న ఎముకలప్రోగు
శరీరం వణికింది. చిన్నసామికి కంట్లోనీరు వచ్చినా అణుచు
కొన్నాడు. పరోపకారి బుద్ధివుండడం మేలా! కష్టమా! అని ఆలోచిం
చాడు. తానిప్పటికి ఎంత లేదన్నా ఈ రెండేళ్ళలో రామిగాడికి కనీసం
ముప్ఫయిరూపాయలున్నా సాయంచేసివుంటాడు. పోనీ 'బీదవాడు.'
'అయ్యో కూడే' 'కూడు కావాలే!'

చిన్నసామి, రామిగాడుకూడా కొద్దిగా వుల్లిక్కిపడి తిరిగిచూసారు.
లచ్చిమి ఏడేళ్ళచిట్టిగాడిని ఎత్తుకోలేక ఎత్తుకొనివచ్చి ఆయాసంగా దిం
పింది. చిట్టిగాడు నిలపడలేక అక్కడేకూర్చున్నాడు. రామిగాడు
ప్రశ్నార్థకంగా చూసాడు, లచ్చిమివేపు. లచ్చిమి దీర్ఘనిట్టూర్పు వది
లింది "నే నాసుపత్రికి పోయా. అయిదురూపాయలు కావాలంట.
నాకు ఇరోచనాలంటే ఏదో నీళ్ళిచ్చారు. అక్కడే దాగమన్నాడు.
కలరా ఇంజీసనిచ్చారు..."

"కలరా" అనేటప్పటికి రామిగాడి ప్రాణం గుభేలుమంది. చిన్నసామీ
జాలిగా భయంగా చూసాడు "వాంతులుకూడా అవుతోందా" అని
అడిగాడు.

"లేదు బాబయా! నాకరము. అది ఏవిళ్ళు" నాకు పెతిబిడ్డకూ వత్తుంది.
అక్కడనే బెక్కుకొన్నాను. "అది కలరా అని" కలరా ఇంజీస
నిచ్చారు"

''నాయనో'' నాకు బుక్కు కావాలి. లేదా మేష్టారు నన్ని వేళ బళ్ళోకి రానీనని గట్టిగా చెప్పేడారు. ''కళ్ళునలుముకొంటూ వచ్చాడు చిన్న సామి కొడుకు. రామిగాడు వుసురన్నాడు. తానింతకు క్రితం చిట్టిగాడి చేతిలోవుంచిన రూపాయిబిళ్ళ తీసాడు. చిన్నసామి వాడిస్తా మనుకొం టుండగనే ఆపిల్లాడి చేతిలో రామిగాడు పెట్టడం...వాడు పరుగెత్తు కొని వెళ్ళడం జరిగిపోయింది. చిన్నసామి ఎంత దయాపరుడో చిన్న సామి కొడుకంత దయాహీనుడు. వాడికి తనతండ్రి రామిగాడికి సాయం చెయ్యాడం తెలుసు. ''బీదవాళ్ళని రక్షించేందుకు నీవేమి అపర కుబేరు డివా?'' అని ఎప్పుడూ ప్రశ్నిస్తాడు కళ్ళతో'' ఆ సంజ్ఞలు చిన్నసామికీ తెలుసు. రామిగాడిమూలాన ఒక్కొకప్పుడు పెళ్ళాం పెద్దగా తగు లాడుతుంది కూడా కొడుకుమాటలువిని.

''వుంచుకోరాదా ఎందుకిచ్చావు రామిగా : ఎలాగూ నీకింక బాడుగ దొరకదు. ఆరూపాయ పెట్టి మంగలరాముడిదగ్గరన్నామందు...'' అర్ధోక్తి లోనే అందుకొని రామిగాడు అన్నాడు'' వాడిముందు తాకటేరే మేలు బాబయ! ఒక్కసారిగా అయిదు రూపాయలతో తుపిలి పడు తాడు.

''వీడు నాపాణాలని కొరికేస్తాడు. అట్టాగే తగ్గిపోతుంది''

''సరే పోనీ'' ఆ తర్వాత ఇంటికిరా...నూకలన్నా ఇస్తాను అమ్మనడిగి. ఇదిగో పెరటివైపుగారా...చిన్నమ్మగారి కండ్లకు పడకుండా... బండీలో అన్నా తీసుకవెళ్లు ''లచ్చిని'' చిట్టగాడ్ని'' అన్నాడు చిన్న సామి...ఆఖర్న.

''ఏయ్! బండీ కడతావా!''

రామిగాడు గభాల్న తిరిగిచూసాడు ''ఆఁ...ఆఁ...బాబయ...''

''బాడుగ ఎంత ?''

''మీచిత్తం బాబయ! నా మామూలు సేసనుకి ముక్కాలురూపాయ''

'ఆరణాలిస్తాను, వస్తేరా ''

"రండి ..బాబయ్య"

చిన్నసామి ఆ ఆసామితో అర్ధరూపాయన్నా ఇయ్యి అని అడిగాడు. ఆ ఆసామీ సరే నన్నాడు.

సగం ఇరుసుతోనే బండికట్టాడు రామిగాడు. అర్ధరూపాయి వచ్చినట్టే- సగం దారిలో మంచివర్షం అంకించుకుంది. గతుకుల్లో బండి సాగి పోతోంది.

హఠాత్తుగా గతుకులో బండి జరిగిపోయింది. రామిగాడు బండిలోంచి దూకాడు.

ఏముందీ, ఇరుసు విరిగింది. బండి నడవదు. జోరున వర్షం - రామిగాడు తనను తాను తిట్టుకొన్నాడు. లోపల ఆసామీ కూడా చిక్కుడి పోయాడుకదా!

బాబయ్యా, రామిగాడు భయం భయంగా అన్నాడు.

ఏమిరా, ఏమైంది.

ఇరుసు విరిగింది బాబయ్యా, బండి నడవదు.

బూతులు తిడుతూ ఆసామీ ఆ వర్షంలో బండిదిగాడు. ఇలాంటి బండి ఎందుకు కట్టావు. మద్దె దారిలో నే నేమైపోవాలాని"-

ఆసామీ గొడుగు తెరచి డబ్బులివ్వకుండా నే సాగిపోయాడు. రామి గాడు అడగలేకపోయాడు. ఎలా అడగడం!

నడిమద్దె దారిలో విరిగిపోయిన బండిదగ్గర దీనంగా నిలబడ్డాడు రామి గాడు. ఎద్దును బండినుండి విడిచాడు.

అర్ధరూపాయకోసం ఆశపడ్డాడు. ఇంటిదగ్గిర అచ్చి, చిట్టిగాడు ఏమై పోతున్నాగో, చిన్నసామి నూకలిస్తనన్నారు. బాడుగమాని తెచ్చు కున్నాపోయేది.

బండీ ఎద్దును వదిలి రామిగాడు వెళ్ళలేదు. దీనంగా బండివంక చూశాడు రామిగాడు.

గోతిలో దిగడి ఇరుసు విరిగిపోయి పడి ఉంది—ఏకైక జీవనాధారం-- రామిగాడి బండి!

సాత్యకిరావు

# అదృష్టం!

గణ, గణ, గణ, గణ.

రిక్షా మహా జోరుగాపోతోంది. అసలే డౌను. ఆ డౌనులోనే ఇంకా వేగంగాపోనిస్తున్నాడు. ఆ వేగానికి రిక్షాలో కూర్చున్న బుర్రమీసాల పెద్దమనిషికి కొంచెం భయంకలిగింది. "అబ్బాయ్! రిక్షాకొంచెం నెమ్మదిగా పోనీయ్!" అన్నాడు.

"ఏం ఫర్వాలేదుబాబూ! తొందరగాపోతే మరోకిరాయేదైనా దొరుకుతుందేమోనని ఆశబాబూ!" అంటూ రిక్షావాడు కారుతున్న చెమట నొకచేతితో తుడుచుకోసాగాడు.

రిక్షా పోవాల్సినదూరం ఇంకా చాలావుంది - కూర్చున్న పెద్దమనిషికేమీ ఉత్సాహంగాలేదు. రిక్షావేగానికి భయపడుతున్నప్పటికీ పైకి కనబడకుండా నటించుతూ "ఇదిగో అబ్బాయ్! రోజుకేమాత్రం సంపాదిస్తావ్?" అని మాటల్లోకిదించాడు. రిక్షావాడు మంచిహుషారుగావున్నాడు. "ఏం చెప్పమంటారు బాబూ! ఒక రోజున రెండు రూపాయలు దొరుకుతాయ్! మరోరోజున మూడురూపాయలు దొరుకుతాయ్ - మరీకష్టమైతే నాలుగురూపాయలు దొరుకుతాయ్ బాబూ! అంతకుమించి దొరకటం చాలాకష్టం! ప్రొద్దుగూకులూ చెమటోడ్చి సంపాదించడమేగాని మాకుమిగిలేదేముందండీ?' 'ఏం? సంపాదించినదంతా ఏంచేస్తావ్?" అన్నాడా పెద్దమనిషి అమాయకంగా.

"కిరాయి దొరికినా దొరక్కపోయినా రోజుకు రెండు రూపాయలు బిళ్ళకుడుముల్లా రిక్షాబాడుగివ్వాలి బాబూ! ఇక మిగిలిన దాంతో లైసెన్సులనీ, పోలీసు మామూళ్ళనీ, మా కుటుంబ ఖర్చులు అన్నీ గడుపుకోవాలి బాబూ! ఒక పూటతినీ ఒకపూట తినకా ఏదో అలాగే జీవిస్తుంటాం బాబూ!" అన్నాడు.

"అయితే రిక్షావాళ్ళంతా రూపాయికిరాయడిగితే నువ్వు అర్ధరూపా

యితే వచ్చావేం? వాళ్ళకి పోటీగా వచ్చావు కదా రేపు వాళ్ళు నీకు పోటీరారా?" అన్నాడు రిక్షాలోని పెద్దమనిషి మీసాలు దువ్వుకొంటూ,

"రారుబాబూ! మాకు యూనియన్ వుంది. రూపాయికి తక్కువ రిక్షావాళ్లెవరూ రారు. కాని నాకు డబ్బవసరముండి నేనే వచ్చాను. ఈ అర్ధరూపాయి నా జీవితంలోని ఒక ఆశాజ్యోతికి తోడ్పడుతుంది. ఈ అర్ధరూపాయి లేకపోతే పూర్తిచేసిన పజిల్ ఎందుకూ పనికిరాకుండా పోతుంది బాబూ!" అన్నాడు రిక్షావాడు.

"నీకు పజిల్స్ పిచ్చికూడా వుందన్నమాట. అయితే ఇంక పిల్లాజెల్లా నెలా పోషిస్తావ్?" అన్నాడు పెద్దమనిషి.

"పిచ్చేముంది బాబూ! బుద్ధి నుపయోగించి పనిచేసేదానికి ఇదేం లాటరీకాదు కదండీ. స్క్వేరువర్డ్సుకి కట్టగా ఏమైనా మిగిలితే పిల్లా జెల్లా బతుకుతాంబాబూ!" అన్నాడు రిక్షావాడు.

గణ, గణ, గణ.

రిక్షా ఆగింది. పెద్దమనిషి డబ్బులిచ్చి దిగి వెళ్ళిపోయాడు.

దేశంలో మద్యపాననిషేధం అమలుజరిగింది కదా అని అనుకుంటే యీ పజిల్స్ తలెత్తి ప్రజల్నిపాడుచేస్తున్నయ్. ఈ పజిల్ పిచ్చిదేశంలో నలుమూలలా వ్యాపించి ప్రజల్నుంచి అంతులేని ధనాన్ని దోచేస్తోంది. అడుక్కుతినేవాడు మొదలుకొని అందల మెక్కేవాని వరకు అంతా పజిల్స్ పూర్తిచేసేవారే!

గణ, గణ, గణ.

రిక్షా గుడిసెదగ్గరకు జేరుకుంది. గుడిసెలోపల దీపం మిణుకు మిణుకు మంటూ వెలుగుతుంటే దానిక్రీనీడలోనే మాసి, చినిగిపోయిన

చల్లని కోక కట్టుకొని ఓ అమ్మాయి కూర్చునివుంది—రిక్షా చప్పుడు కామె లేచి బయటకొచ్చింది. "ఏమే గంజేమన్నా వుందటే!" అన్నాడు. పాపమా మాటకామె కళ్ళలోనుంచి నీళ్ళు గిర్రునతిరిగినయ్. నోటి నుంచి మాట వెలువడలేదు.

"రెండు రోజుల నాడనగా రూపాయి యిస్తే అది అరోజుకే అయిపోయె. నిన్న అప్పుచేసి ఓ గిద్దెడు నూకలు తెచ్చి గంజివార్చాను. ఈ రోజున అదికూడా లేదు. ఇంటికాడా తింటానికి లేకపోయినా మళ్ళీ అపజిల్సుకు అయిదురూపాయలు తగలేశారు. పగలల్లా చెమటోడ్చి కష్టపడటమూ పజిల్స్‌కు తగలెయ్యటమూ మిగిలింది రిక్షాబాడుగకూ; ఇలా అయితే సంసారమెలా సాగుతుంది. ఆ పజిల్స్‌లో మనకొచ్చేదేముంది. తడవ తడవకూ దానికే అయిదురూపాయలు పెట్టడం సరిపోతోంది. ఇకనన్నా పజిల్స్ మానేయ్!" అంది భార్య.

"మానేస్తాను! మానేస్తాను!! ఇంతకీ గంజేమైనా . . . . ?"

"ఉహూఁ! వాడకట్టంతా అడిగిచూశాను. లాభంలేకపోయింది. కడుపులో కాళ్లు పెట్టుకొని అలాగే పడుకొన్నాను."

"ఒసే కాసినిమంచినీళ్ళన్నా యివ్వు?"

మాటనడంతడవుగా కుండలోని చల్లని మంచినీళ్ళు ముంచి యిచ్చింది భార్య. మంచినీళ్ళు త్రాగి రిక్షామీద పడుకున్నాడు.

గణ, గణ, గణ.

రిక్షా మెల్లిగా పోతోంది. వాహకుడు తప్ప దానిలో ఎవ్వరూ లేరు. తిండిలేక రిక్షావాడి మొహం సన్నగిలిపోయింది. కళ్లలోతుకు డోక్కుపోయినవి. కాళ్ళల్లో బలంలేక రిక్షా త్రొక్కలేక పోతున్నాడు. కిరాయి దొరికినా దొరక్కపోయినా రిక్షాబాడుగ

మాత్రం రెండురూపాయలు కట్టితీరాలి. ఆ బాడుగకూడా నాలుగు రోజులనుంచి కట్టడంలేదు. ఈ రోజుకూడా బాడుగ కట్టకపోతే రిక్షా లాక్కుంటారు. ఇక రిక్షా యివ్వనేయివ్వరు.

ఎలాగైనా తంటాలుపడి డబ్బు సంపాదించాలనుకొన్నాడు. కాని రిక్షాతొక్కేశక్తి లేకపోయినప్పుడింకా కిరాయేం సంపాదిస్తాడు! ఒక రోజుదా, రెండు రోజులదా? నాలుగురోజుల కిరాయి కట్టాలి-మాటలా?

వాడి అదృష్టమా అని అర్ధరూపాయి కిరాయి దొరికింది. కాని ఇద్దరి నొకే రిక్షాలో ఎక్కించుకెళ్ళాలట. సరేనని ఒప్పుకొన్నాడు.

గణ, గణ, గణ, గణ.

రిక్షా సాగిపోతోంది. ఇదివరకటంత వేగమిప్పుడా రిక్షాలో లేదు. ఇంతలో సైకిల్ వేసుకొని చటుక్కున కానిస్టేబుల్ తయారయాడు "ఏరా కళ్ళుమూసుకుపోయాయ్రటా? ఇద్దర్నెక్కించుకుతొక్కుతున్నావ్-నీపేరేమిటిరా? లైసెన్సు నెంబరెంత?" అంటూ జేబులోనుంచి డైరీ తీశాడు.

కానిస్టేబుల్ని బ్రతిమలాడుకుని ఆ కిరాయి అర్ధరూపాయి డబ్బులూ చేతులో పెట్టాడు. కానిస్టేబుల్ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. రిక్షా యింకా రెండుఫర్లాంగులదూరం పోతేనేగాని రిక్షాలో ఎక్కిన యిద్దరూదిగరు. రిక్షా మెల్లిగా సాగింది. రెండు గజాలైనా వెళ్ళకముందే రిక్షావోనరు హాజరయ్యాడు. నాలుగురోజుల నుంచి బాడుగ యివ్వకపోవటంవల్ల వోనర్ మండిపోతున్నాడు. పైగా ఒక పోలీసునుకూడా వెంట సహాయం తీసుకొచ్చాడు.

"ఏరా, నాలుగురోజుల్నుంచీ అద్దె ఇవ్వకుండా రిక్షాకాజేయాలనుకున్నావా? నీ బాబుదనుకున్నావేరా తేరగా తొక్కుకోటానికి. ఏవీ నాలుగురోజులడబ్బులు?"

రిక్షా ఆగింది. వాడు చేతులు నలుపుకొంటూ అన్నాడు.

"లేదు సామీ! రెండు రోజులనుంచి బొత్తిగా కిరాయే దొరకటంలేదు. రేపో ఎల్లుండో మీ అద్దె పూర్తిగా కట్టేస్తా బాబూ!"

"ఏడిశావులేరా? ముందు నాలుగురోజుల అద్దె యివతల పారేయ్. ఈవిధంగా పేచీపెట్టేవాడికి రిక్షా ఎవడిస్తాడురా! రిక్షా తీసుకెళ్ళి దొడ్లోతోసెసిరా!" అన్నాడు యజమాని.

"డబ్బు తియ్యవేరా యింకా?" అన్నాడు పోలీసు లాఠీ వూపుతూ.

"డబ్బులు లేవండీ! రేపుకొంత, ఎల్లుండికొంత చెల్లగడతానండీ."

"అదేంకుదరగు. చూస్తారేంటి నాలుగు తగలనియ్యక?"

ఆ మాటరావటమే తడవుగా పోలీసు లాఠీకి పనికలిగింది. ఇష్టమొచ్చినట్లుగా బాది రిక్షా తీసుకొని వాళ్లు వెళ్ళిపోయారు. ఇదంతా చూస్తున్న రిక్షాలోని వారిద్దరూ దిగి నడిచి వెళ్ళిపోయారు. రిక్షావాడికి బాగా దెబ్బలు తగిలినయ్. దెబ్బలు తగిలితే తగిలినయ్, రిక్షాకూడా తీసుకుపోయారు. ఇక జీవించేదెలా? రిక్షావాడి బుర్ర తిరిగిపోయింది.

ఇంటికి పోదామంటే కాళ్ళు రావటంలేదు. వారంరోజులనుంచి ఇంటివద్ద భార్య పస్తు. గంజి నీళ్ళకుకూడా గతిలేకుండా పోయింది. మూడురోజుల డబ్బు పజిల్ కు తగలేశాడు. నాలుగురోజులనుంచి కిరాయి దొరకటంలేదు. ఇప్పుడు రిక్షాకూడా చేతిలో లేకుండా పోయింది. పజిల్ ప్రపంచంతో తగలేసిన డబ్బుకు అంతులేదు. చివరకు వాటిరూపేణా సంసారంకూడా పాడుజేసుకొన్నాడు.

విచారంతో తలవంచుకొని మెల్లగా అడుగులో అడుగువేసుకొంటూ ఎక్కడికో నడిచిపోతున్నాడు. జీవితం భారమైనప్పుడు జీవికి మిగిలేది విచారమేగా! కలిసిరానప్పుడు మిగిలేదల్లా కర్మను దూరుకోవటమొక్కటే! వాడి కర్మ అనీ, నొసటి వ్రాతనీ తెల్రి మొర్రి చేష్టలతో గోల్లుగిల్లుకొంటూ కనబడని భగవంతుని, కర్మనూ దూరటం మనవాళ్ళకు బాగా తెలుసు.

పాపం! రిక్షావాడికర్మ!!

ఎక్కడికో! ఇంకాపోతూనేవున్నాడు!!!

ఎదురుగుండా మెస్సెంజరు ఎర్రని సైకిల్‌తో గబగబావస్తున్నాడు. తల వంచుకుపోయే రిక్షావాడికి వచ్చే సైకిల్ దృష్టిలో లేదు, కాని ప్రక్కన నిలబెట్టివున్న మరోరిక్షావాడాకర్షించాడు.

ఇద్దరూ సంభాషణలోకి దిగారు.

"రిక్షాఏమయిందిరా? నడిచిపోతున్నావు?" అన్నాడొకడు.

"రిక్షా అద్దెకట్టడంలేదని లాక్కున్నారు. మీ యజమానిదగ్గరన్నా ఒక రిక్షా యిప్పించరా. డబ్బు ఎప్పటికప్పుడే కట్టేస్తాను. ఈసారి కాస్త ఆలస్యంచేశానని మా మేనేజరు రిక్షాలాక్కుని పైగా పోలీసుచేత కొట్టించాడు" రిక్షావాడు కన్నీరు కారుస్తూసాటివాడిని బ్రతిమలాడుకో సాగాడు. మెస్సెంజరు సైకిల్ రిక్షా దగ్గరకురాగానే ఠక్కుమని ఆగిపోయింది.

"272 నెం. రిక్షావాడు రామయ్య అంట ఎవడురా" అన్నాడు మెస్సెంజరు.

"ఎందుకుబాబూ! నేనే!!" అన్నాడు కన్నీరుతుడుచుకుంటూ రామయ్య.

"టెలిగ్రాం వుందిరా! ఇదిగో! సంతకంచెయ్!"

"టెలిగ్రామా! ఎందుకుబాబూ!"

"నీ అదృష్టంరా! పజిల్స్‌లో ఫస్టుప్రైజు వచ్చిందట. టెలిగ్రాం యిచ్చారు."

"నిజమేనాబాబూ! ఏదా టెలిగ్రాం!!"

రామయ్య సంతకంచేసి టెలిగ్రాం తీసుకొన్నాడు. నిజంగానే దానిలో-"First Prize-Squarewords-Congratulations" అని వుంది. రామయ్య సంతోషానికి అంతులేదు. ప్రక్కనున్న రిక్షావాడికికూడా చెప్పకుండా ఆనందంతో యింటికి పరుగెత్తాడు ఈ శుభవార్తను భార్యకందజేయటానికి!

'సత్యమూర్తి'

# అంతేగామరి!

మిత్రులంతా ఒక నాటకాన్ని ప్రదర్శిద్దామని ఉత్సాహపడ్డారు. ప్రజల్లో చైతన్యం కల్గించే నాటకాలయితేనే ఆర్గనైజ్ చేస్తానని చెప్పాను అంతకుముందు కొన్ని నాటకాలాడి తృప్తిలేక పోవటంవల్ల.

అంతా సరేనన్నారు. ఒక నాటకాన్ని ఎన్నుకొని పాత్రల సెలెక్షన్స్ పూర్తిచేశాం. ఇంకమాకు మిగిలిందల్లా హీరోయిన్ సెలెక్షన్.

స్త్రీపాత్ర కోసం భాస్కరాన్ని పంపిద్దామన్నారు. వాడిపేరెత్తగానే నాటకం ప్రదర్శించే అవకాశం వుండదనుకున్నా. వాడి చేష్టలన్నీ నాకు తెలుసు. ఇలాగే మునుపోసారి వెళ్ళేవారు లేకపోవడంచేత వాడినే పంపక తప్పలేదు స్త్రీపాత్రకోసం. వెళ్ళిన మూడోనాడు రూముకు చేరేసరికి ఒక కవరు పడివుంది. పోస్టు ముద్ర స్పష్టంగా అవుపించక పోవటంవల్ల కవరు చింపేవరకు ఎచ్చటినుండి వచ్చిందీ గ్రహించలేక పోయాను. లోపలి భాగంలో సువర్ణాక్షరాల్లాగా అడ్రసువుంది.

యం. ఆర్. భాస్కరం

C/O అంజనీబాయి

డాన్సర్.

ఆమెను బుక్ చేయటానికి మాసలహాలకోసం జాబువ్రాసేడని భావించా. కాని లెటర్‌పూర్తిగా చదివేసరికి ప్రదర్శనకు వాయిదా పడేటట్లుంది—

డియర్‌మూర్తి,

మన నాటకం గొప్పగావుందనిపించుకోటానికి విశ్వప్రయత్నంచేసి ఓ చక్కటిస్టార్‌ను మాటయ్యాను. మన వివరాలు తెలియజేస్తూ మేము ఉచితంగా ప్రదర్శించటమే కాబట్టి మీ సహకారం కూడా చూపుతూ ఒక విధంగా ప్రతిఫలం పుచ్చుకోమని కోరాను. మనం అనుకొన్నదాని కంటే పనిరూపాయలు తక్కువగానే కోరింది. సంతోషంతో అడ్వాన్సు యిచ్చి తిరుగు ప్రయాణానికి సిద్ధపడ్డాను. అంజని "యిప్పుడు బండి

లేదు కదండి! రేపు వెళ్ళుదురుగాని అంటంవల్ల వుండక తప్పలేదు. అచ్చట ఏమీ తూరుబోక పిక్చరుకు వెళ్లివచ్చాం. మేము వచ్చేలోగా వాళ్ళ బామ్మ వంటపూర్తి చేసింది. ఆమెతోపాటు భోజనం తీసుకోవటానికి యిష్టం వున్నప్పటికీ హోటల్‌కు వెళ్లివస్తానని చెప్పేసరికి అంజని "మావంటకాలంపై అయిష్టత అయితే వీలుయిష్టమ"ని నిరుత్సాహంతో జవాబిచ్చే సరికి అక్కడే తీసుకోక తప్పిందికాదు.

ఆరాత్రి అంజని ఇంట్లోనే ఉన్నాను. అంజని చాలా అందంగా ఉంటుందిసుమా! ఆమెను చూడగానే ప్రేమించానా అనిపించింది. కాని, ఆమాట చెపితే అంజని నన్ను బయటికిగెంటదు కదా అని భయపడి ఊరుకున్నాను.

ఒక రాత్రివరకు అంజని గదిలోంచి మధుర సంగీతం వినిపించింది. ఆలకిస్తూ కూర్చున్నాను మెలుకువగానే.

సంగీతం ఆగిపోయింది సడెన్‌గా- ఎదురుగా వచ్చి నిలబడింది అంజని. కళ్ళు నులుముకు చూశాను. అంజని-

"ఏమండీ - నేను మిమ్మల్ని చూడగానే ఎందుచేతనో ప్రేమించాను." అంది.*

ఆశ్చర్యపోయాను-నాఆనందానికంతులేదు, రిజిష్టరు మేరేజి చేసుకుందామని అన్నాను - వొప్పించాను. వారం రోజుల్లో పనులన్నీ పూర్తవుతవి. మన నాటకం ఆగిపోకుండా వుండేందుకు మరొకర్ని చూసుకుంటారనీ దీనివల్ల మీకు బాధకలిగిస్తే క్షమిస్తారనీ ఆశిస్తా అని వ్రాశాడు. బుక్ చెయ్యడానికి పోయినవాడు వాళ్ళకు బుక్కయ్యాడేమిటని నివ్వెర పోయాను.

ఇలాంటి ఒక్కొక్క సంఘటన తలపుకువస్తుంటే పకపకా నవ్వక తప్పిందికాదు - ఏంటి గురూ! అని లంకించుకున్నారు మిత్రులంతా నేను నవ్వటంచూసి. "భాస్కరం వెళ్ళితే తిరిగివస్తాడనే ఆశ

లేదుగా?” అన్నా. భాస్కరం ముఖం మాడ్చుకున్నప్పటికీ వాడూ మిత్రులతో పాటు చిరునవ్వునవ్వేడు. మాట్రూపులో నాలుగు మాటలు చెప్పి మనస్సును మార్చాలంటే భాస్కరంగాణే దిట్ట-చివరకు వాణ్ణే పంపటానికి తీర్మానించారు. మొదట వాడు నిరాకరించినా పట్టుదలతో సాగనంపేము.

భాస్కరం వెళ్ళగానే రాజు ప్రశ్నించాడు. “అంజని యిప్పుడు భాస్కరం దగ్గరేవుంటోందా?” అని.

దానికంతా ఓగాథవుందిలే అంటూ లేచి నిలబడ్డాను యింటికి వెళ్లే వుద్దేశ్యంతో. ఏమిటో చెప్పండని రాజులంకించుకొనేసరికి చెప్పక తప్పింది కాదు.

అంజని వస్తుతా పేరు పడ్డ డాన్సర్. పెండ్లిండ్ల సీజనుకానప్పుడు అప్పుడప్పుడు నాటకాలలో కూడా పాల్గొంటూవుండేది. స్టారుకోసం వెళ్లి నవయుగ ఆర్టుథియేటర్స్ ట్రూపులో ఉన్నప్పుడు భాస్కరం ఆమెతో పరిచయం చేసుకున్నాడు. ఆ పరిచయంతో ఆమెను రిజిష్టర్ మేరేజి చేసుకోవటం జరిగింది. మనస్పర్థలకు అవకాశం యివ్వకుండా అన్యోన్యంగా కొన్నిరోజుల్ని సాక్షిగా దొర్లించారు.

ఒక నాడు విశాఖపట్నం నుండి అంజనిబాయిని ఆహ్వానించటానికి ఒకరు రావటం జరిగింది. అయిదు రోజుల పెండ్లిలో పాల్గొనేందుకు 500 రూప్పాయిల అడ్వాన్సు నూటపదహార్లు అందజేస్తూ ఆమె కళ్లల్లోకి తీవ్రంగా చూచాడు. అతడు గొప్పరసికుడని అట్టేగ్రహించింది. ఆమె కోసం అర్రులుచాస్తున్నాడని పసికట్టింది-వాళ్లకలయికకు భాస్కరం అడ్డుగావుంటంవల్ల వెనుకంజవేసింది. ఆవచ్చిన వ్యక్తితో అచ్చట కలుస్తానని అడ్రసు తీసుకొని అతన్ని పంపించింది.

భాస్కరం వెంటవుంటే అతన్ని తృప్తిపరచటానికి ఎలా వీలవుతుంది? ప్రతి ప్రోగ్రాంకు వెంటవస్తుంటే యిలాటి సమస్యలు ఎలా పరిష్కారమవుతాయి? భాస్కరం అజ్ఞలోనే వుంటే తను ఎలా జీవించాలి?

యిప్పుడు జీవించేలాగునే ఇలాగే జీవిస్తే తన సంపాదన ఎన్నాళ్లు వస్తుంది? భాస్కరం సంపాదనతో తను బ్రతకటం లేదే? అంజని మనస్సు పరిపరివిధాల ఆలోచించింది. తన ఆజ్ఞను పాలించకపోతే భాస్కరంతో విడిపోవాలని నిశ్చయించి ప్రయాణ సన్నాహాలు జరుపుతుండగా భాస్కరం అవతరించి 'ఎక్కడికో ప్రయాణం!' అంటూ ప్రశ్నించాడు.

'వైజాగ్'

'అదృష్టమే!'

'ఎందుకో?'

'చక్కటి ప్రదేశం, విశాల ప్రకృతి!'

'ఓహో! బాగుంటుందన్నమాట!! బామ్మతో జాగ్రత్తగా వుంటావు కదూ!'

"అలావున్నారేం! నాలుగు రోజుల్లోవస్తాంగా! ఖర్చులు వ్యర్థంతప్ప మరేముంది చెప్పండి?"

'నీ యిష్టం'

'అలా అంటారేం?'

'అనేదేముంది? స్వేచ్ఛగా తిరిగిరా

'మరోవిధంగా భావిస్తున్నారు.'

'భావించేదేముంది? అందర్నీ తృప్తిపరచటమేగా నీవిధి'

'పొట్టకోసమేగా!'

నీతిగావుంటే నీ సంపాదనవల్ల పొట్టగడవదా? నీ వీ దృక్పథంలో వుంటే నీ మనస్సు మార్చుకోలేవు - వెళ్లొస్తానంటూ చిరుకోపంతో బయటకు వచ్చాడు. అంతటితో అంజని సంబంధం విడిపించుకొని యిక్కడే వుంటున్నాడంటూ ముగించేసరికి మిత్రులంతా నిజమే మరి! అటువంటి అవకాశాలకు ఎగబ్రాకితే వీళ్ళపరిస్థితులిలాగేవుంటాయి. కేవలం పక్షీంద్రపదవికే (వాళ్ల అడుగు జాడల్లో ఉండడానికి) ప్రాధాన్యతయిస్తే ఎటువంటి విడాకులూ వుండవన్నారు - అంతేగా మరి!

ఆరణి దశరథ

# నేటిచదువులు

తాటితోపులో చిరుమువ్వల గలగలలతో గిత్తలు ఉరకలు తీస్తున్నవి. ఆ గూడుబండిని అమాంతంగా లాక్కెళ్తున్నాయ్. మధ్యమధ్య 'హేయ్' 'డిర్ర్ర్' అంటూ చర్నకోల విదలిస్తున్నాడు వేగం హెచ్చించాలని వెంకాయి.

వెంకాయి పట్నంలో సంగతులన్నీ తెలుసుకోడానికి చిత్ర విచిత్రమైన ప్రశ్నలు వేస్తున్నాడు చంద్రాన్ని. చంద్రంవాటికి సమాధానాలిస్తున్నాడు నవ్వుతూ.

"ఏం బాబయ్యా! పట్నంలో ఈ మాదిరిగిత్తలు చానా ఉంటాయా?" అని అడిగాడు వెంకాయి వెనుదిరిగి.

"ఇల్లాంటి గిత్తలు అవుపడవు. అసలు గిత్తలతో ఏంపని అక్కడ?" అని వెంకాయిని మళ్ళీ సందేహంలోకి దింపాడు. గిత్తలు లేందేవాళ్ళు అంతమంది ఎలా బ్రతుకుతున్నారా అని—.

'హేయ్!' మాట్లాడితేచాలు ఇవి తగ్గపోతాయి బాబాయ్!, అంటాలో కలుమెలిపెట్టాడు. గలగలమంటూ పరుగెడ్తున్నాయ్ గిత్తలు. చంద్రం చుట్టూప్రకృతినిచూచి ఆనందిస్తున్నాడు.

"హోయ్‌బావా! ఏంటి అలాతోలేస్తున్నావే కోడెలను? ఆపావునీ జోరు. దోవలో ఆవుపెయ్యి పండుకొని నెమరేస్తుంటే అలాతోల్తున్నావే!" ఎవరిదో ప్రక్కనుంచి ఓ కేకవచ్చింది.

వెంకాయి ప్రక్కకు తిరిగిచూచి—"నాకు అవుపడ్తున్నాయి లేవే! అడిసరేగాని దోవలో పెయ్యలను పండబెట్టి మాతో మాట్లాడి తమాషాలాడాలని ఉందీ! వేగిరంవచ్చి పెయ్యినితోలు" అన్నాడు పగ్గాలు లాగుతూ—

"అయ్యో! మాబావతో సరసాలాడకపోతే ఎల్లామరి; ఎవరెల్లేరేమిటీ చేసనుకు?"

"ఎల్లడమేమిటీ నీ మొగం, చినబాబుగారే వస్తున్నారు."

వచ్చి—"చినబాబుగారా......?" అంతకంటే మాటరానీయక పెదాలు నిలిచి పోయాయి. తలవంచివచ్చి పెయ్యనితోలింది. నిండు జవ్వని. దేహకాంతి మిలమిలమంటున్నది. చంద్రం చూచి విస్తుపోయాడు. పట్నంలోఉన్న స్త్రీలకు వీళ్ళకు ఎంతభేదం? భేదం ఉండదూ మరి అప్పుడే పట్నంనుంచివచ్చిన చంద్రానికి ?

రామయ్యకు చంద్రం ఒక్కడే కుమారుడు. కాలేజిలో 'సెకండ్ ఇయర్' చదువుతున్నాడు. ప్రక్క జిల్లాలో కాలేజి ఉండికూడ, రామయ్య తన ఒక్కగాని ఒక్క కొడుకును పట్నం పంపాడు లోకజ్ఞానం ఇంతకంటే ఎక్కువ అబ్బుతుందని. చంద్రం వేసవి సెలవులకు ఇంటికి వెళ్లాడు. రామయ్యకు దాదాపు ఓపాతిక ఎకరాల మాగాణీఉంది. ఆ పల్లెలో రామయ్య మోతుబరి రైతు. ఆనాడు చంద్రం వస్తున్నాడని ఆ ఇంటో పండుగలాగుంది. మూలనున్న ఎడ్లమువ్వలపట్టెలుతీసి బండి సింగారించి కట్టుకుపోయిన పాలేరు వెంకాయికే పండుగైతే తల్లితండ్రులకు ఉండదూ మరి ?

## 2

హాస్టల్‌కి టెలిగ్రాం రావడం, చంద్రం వెంటనే రైలెక్కడమూ, తన్నుచూడగానే తండ్రి కన్నుమూయడం అంతా నిమిషాలలో జరిగిపోయాయి. అందరూవచ్చి పరామర్శించారు. కర్మకాండంతా జరిగాయి. చంద్రం మొదటినుంచి కుటుంబవిషయాలలో జోక్యముపుచ్చుకొనే వాడుకాదు. అసలు స్వంతమాగాణి ఎచ్చటెచ్చట ఉండేదికూడ సరిగా తెలియదు. ఎప్పుడైనా సెలవలకొచ్చినా వ్యవసాయ విషయాలు తెలుసుకోవాలని కుతూహలమూలేదు. పైగా తండ్రికూడ ఉత్సాహమిచ్చేవాడు కాదు.

అందువల్ల అతనికిప్పుడు పెద్ద సమస్య ఎదురైంది. ఈ ఆస్తిఅంతటినీ ఎలా నిర్వహించుకోవాలి? ఎన్నడూ అలవాటులేని వ్యవసాయాన్ని ఈ నాడు తాను నిర్వహించాలని తను సేద్యం పెట్టించాడు. ఎన్నడూ అలవాటులేని ఎండలు రుచిచూస్తుంటే తాను మాడిపోతున్నాడా అనిపించేది అతనికి? కాని సేద్యం విషయాలేమీ తెలియవు. వెంకాయి దీనిలో చాలా సహాయపడుతున్నాడు. ప్రక్కవాడు ఎలాచేస్తే అలాచేసేవాడు. ఎప్పుడు పైరుపెట్టాలి? భూమిని పైరుకు అదునుగా ఏలా చేయాలి? ఇలాంటివన్ని ఏమీ తెలియవు. ఓవేళ తెలిసినాకూడ పట్నంలో సుఖమెరిగి ఎండనేది తెలియని చంద్రానికి ఈ ఎండలో ఉండటం అసాధ్యమనిపించేది. చల్లటినీడలో కుర్చీలోకూర్చుని కలం పట్టుకొన్న విద్యార్థికి, నిప్పులుగ్రక్కే ఎండలో నాగలిమేడిపట్టుకొని ఆ బురదలో కాళ్లీడ్చు రైతు యువకునకు భేదం—? చంద్రం ఈ అశక్తతను గ్రామంలో కొంతమంది కనిపెట్టారు.

ఆ ఊరిలో రామయ్యకు పోటీవచ్చే రైతు ఇంకొకడున్నాడు. అతడు కోటేశం. అతని దౌర్జన్యానికి అందరూ తలొగ్గారు రామయ్యతప్ప. ఇప్పుడు ఆ రామయ్యకూడ తప్పిపోయాడు. ఇక తన కత్తి కెదురులేదు. కర్మకాండలయిన తర్వాత నే రామయ్య 2000/- అప్పుఉన్నాడని ఒక దొంగ ప్రాంసరీనోటు సృష్టించాడు. ఏమీ తెలియని చంద్రం వద్ద ఆ మొత్తాన్ని సులభంగా లాగగలిగాడు కోటేశం. తండ్రి అప్పు చేయవలసిన అవసరపరిస్థితి ఏమొచ్చింది అనేప్రశ్న ఎదురైంది. కాని కోటేశాన్ని అడగడానికి అవకాశంలేదు - కోటేశం ఇంకాకొన్ని ఇలాంటి కుతంత్రాలు జరుపబోయాడు. కాని వెంకాయివలన కొనసాగలేదు. చంద్రంకూడా వాళ్ళమాట నమ్మలేకపోయాడు. చంద్రం కయ్యానికి కాలు దువ్వేమనిషి కాదు—

ఓ.రోజు కొంతమందివచ్చి ‘‘మనఊరికి పంచాయితీబోర్డు ప్రసిడెంటుకు

మీరు నిలబడాలి. ఏదో చదువుకొన్నారు - యువకులు—''అని మొదలెట్టారు.

అసలు గ్రామంలో ఎక్కువ పరిచయంలేదు కాబట్టి అక్కర్లేదన్నాడు మొదట. కాని వాళ్ళు వదలలేదు. తండ్రి పేరు ఖరాబుచేయకండి అంటూ ఏమేమో ఒత్తిడి చేశారు. చంద్రానికి అంగీకరించక తప్పలేదు. ఆతర్వాత కోటేశం కూడ పోటి చేస్తున్నాడని తేలింది. కోటేశానికి, చంద్రానికి పోటీ చాలా తీవ్రంగా ఉంది. అది అంతతీవ్రంగా ఉండేదికాదు కాని కోటేశానికి వ్యతిరేకమున్నట్లు నటించి, చంద్రం వద్దడబ్బు సంపాదించుకోవాలనే పన్నాగంతో ఆవిధంగానే కొంత మంది ప్రవర్తించి చంద్రంవద్ద ఏడెనిమిదివందలు వదలించి కడకు పడిన ఓట్లలో ముప్పాతిక భాగము కోటేశానికే పడేట్లా చేశారు. ఈ కుతంత్రాలు గ్రహించి గ్రామస్థుల మాట అంతగా వినేవాడుకాడు ఒక్క వెంకాయిమాట తప్ప. ఈ వెంకాయి అసలు అధ్యక్ష పదవికి పోటీ చేయవద్దని ఎంతగానో బ్రతిమాలాడు. కాని మెజార్టీ—?

వెంకాయిని చంద్రం నుంచి తప్పించాలని ఎంతగానో కోటేశం వాళ్ళు ప్రయత్నించారు. ఎన్నో ఆశలు చూపారు. బెదిరించారు. లొంగలేదు. వెంకాయి తప్పాడంటే ఎలాగైనా ఆడించ వచ్చని వీళ్ళ ఉద్దేశ్యం. కాని మధ్యలో వెంకాయి నిలబడ్డాడు. వాడిది ఒక్కటే మాట— నేను వీధులు వెంటాడుతూ ఉన్నప్పుడు రామయ్య తనవద్దనే ఉంచుకొన్నాడు. అప్పటినుంచి ఇచ్చటనే ఉన్నా. రామయ్య ఉప్పుతిని వారికే ద్రోహం చేయలేను—అదికాక అన్యాయం కూడా చూడలేను.

దినదినానికి ఎక్కువవుతున్నాయి ఈర్ష్యాద్వేషాలు - ఓనాడు చంద్రం ఈ విషమ పరిస్థితులను గూర్చి తల్లితో ఆలోచిస్తున్నాడు.

ఇంతలో వెంకాయి ఒగర్చుకొంటూ వచ్చాడు. దేహం, గుడ్డలు రక్తసిక్తమై ఉన్నాయి. ముఖం ఎర్రబారి ఉంది. తలమీద గాయం! చంద్రం విస్తుపోయాడు వెంకాయి భీకరస్వరూపంచూచి —''ఏంటిది ?''

"బాబయ్యా! మీలో అలుసు కను[illegible]న్నారు. ఆడుతున్నారు. [illegible] ఆ లోకేశంగాడి తల ఈ కర్రతో పగల[illegible] [illegible]న్నే కాదు" "ఏంటి వెంకాయి, అసలు. సంగతి?" అన్నాడు జాలిగా చంద్రం.

"ఏం లేదు. మన పొలంలోకి చూచిరాను పోయాను. మన చేళ్ళకు పోయేనీళ్లు నాయెదుటనే తెగగొట్టి వాళ్ల పొలానికి మళ్ళించారు. ఇదేమిటని అడిగితే వాళ్ళపరిహాసాలు ఎక్కువైపోయాయి. వాళ్లు రెండుతడులు పారించుకొన్నా మనం ఒక్క తడి పారించుకోవడం కష్టమాయె. పైరు అలా ఎండిపోతుంటే నూక్కేక అడిగాను అలా వీలుకాదని - కాని వాళ్లు వినలేదు. తర్వాత ఘర్షణ ఫలితం ఇది" కోపంతో చంద్రానికి వెంకాయిని చూస్తుంటేకళ్ళలో నీళ్లునిండాయి. "వెంకాయి, నాకొరకు నీవిలాబాధ పడ్తున్నావు. మన కెందుకువాళ్ళతో కయ్యాలు— ?"

లేదుబాబయ్యా! మీకు సేద్యములో అనుభవంలేదు. అందుకని అలాఅంటు న్నారు. మీలో సత్తాచూచే వాళ్లు ఆడుతున్నారు. గమ్ముగా ఉంటే మన ఆస్తి హారతి కర్పూరంలా హరించుక పోతుంది బాబూ!" అన్నాడు కారే రక్తాన్నితుడుచుకుంటూ. చంద్రం ఆలోచనలో పడ్డాడు. అలా బయలుదేరాడు పొలంవైపు. ప్రస్తుతం ఏంచేయడం ? సేద్యం అనుభవం లేదాయె! భారమంతా తన మీదనే ఉంది.

పైఘటన జరిగిన మరుసటిరోజు రంగయ్య చుట్టకాలుస్తూ చంద్రం యింటికి వచ్చాడు. ఆఊరిలో చంద్రం క్షేమంకోరే వాళ్లెవరైనా ఉంటే వెంకాయి ఒకడు. ఆ తరువాత రంగయ్య మాత్రమే. చంద్రం వరండాలో ఉన్నాడు.

'కూర్చోరంగయ్య తాతా' అంటూ కుర్చీచూపించాడు. రంగయ్య కూర్చుంటూ—(రంగయ్య పాతకాలపు మనిషి అయినా మంచి ఆలో

చనాపరుడని ప్రతీతి.) "చంద్రం, ఊళ్ళోతగాదాలుజాస్తి అవుతున్నాయని విన్నానే! అంతే చంద్రం! రౌతు మెత్తనైతే గుఱ్ఱం మూడు కాళ్ళతో నడుస్తుంది. మీ నాయన ఉన్నప్పుడు ఊరునంతటిని పిడికిలిలో బిగించి పట్టుకొని ఉంచేవాడు. ఈనాడు పరిస్థితి ఎదురు తిరిగింది. ఈతప్పంతా మీ తండ్రిదే. ఎందుకుచెప్పు మన రైతులకు ఈ B, A. లు M. A లు? ఇప్పుడు నీస్థితిచూడు. మొదటి నుంచి సేద్యం చూచుకొంటూ ఉండి అనుభవము సంపాదించి ఉంటే వీళ్లు ఈ ఆట ఆడగలరా? నీవు చదువుకోవడం నౌఖరీ కొరకుకాదు గదా! ఈ B. A.లు చదివి వచ్చి ఎండలో నిలబడవలెనంటే కష్టమనిపిస్తుంది. అదీగాక అనుభవంకూడ ఏమీ ఉండదు. రెంటికిచెడ్డరేవడి అయ్యావు. నౌఖరీ చూచుకొందామా అంటే ఈ B. A. ల నౌఖరీలు మీ తాహతుకిపనికి రావుగదా. ఈ విధంగా వృత్తులను నేటి చదువులు నాశనం చేస్తున్నాయి. ఇప్పుడు ఒక్కటే కర్తవ్యం. 2, 3 ఎకరాలుంచుకొని, ఏదో చదువు కొన్నవాడివి మిగతా మాగాణినిఅమ్మి వ్యాపారం సాగించు. అప్పుడు నిన్ను అడ్డుపెట్టె వాళ్లెవరూ ఉండరు. లేకపోతే వీళ్ల ఘాతుక కృత్యాలనుంచి తప్పించుకోవడం కష్టం" అంటూ జోళ్లు వేసుకొని లేచాడు. "వస్తాచంద్రం! బాగా ఆలోచించుకో" అంటూ వెళ్లాడు. చంద్రం మనస్సులో పై మాటల ప్రభావం పడ్డది. అలాగే చూస్తుండిపోయాడు కాని ఏమీ చెప్పలేకపోయాడు.

ఆ. రా

# చమురందని వత్తులు

అవి రేషనింగు రోజులు. ఎవరికీ కడుపునిండా కూడులేదు. సగం ప్రాణాలతో సాగిస్తున్నారు జీవితం. అందునా రైతులపని మరీ అధ్వాన్నంగాఉంది. పండించే రైతు కడుపు నిండనిచ్చేవారుకాదు. పంట తయారుకావటమే తరవాయి రైతుదగ్గర భూమిస్వామి గుంజేవాడు, అతని దగ్గర అధికారులుపట్టుకొని వెళ్ళేవారు. ఆకాలంలో ధనికుల గాదులు లేక కొట్లను మాత్రమే వెదికేవారుకారు, కాని బీద రైతుల ఇళ్ళుమాత్రము అంతా గాలించి ఎచ్చటనైనా దాచుకొన్న కొన్ని గింజల్నిగూడ తీసికొనివెళ్ళేవారు. అంతటి కరుణామయులు, ఆనాటి ఉద్యోగులు, ప్రభుత్వం. ఎండనక, వాననక పగలల్లా పొలంలో పనిచేసేకన్నా నియమిత కాలాలలోచేసే కార్మికులపనే సుళువేమోఅనిపించేది పట్నం నీళ్ళుపడ్డరైతులకు. అంతా కార్మికులైతే అందరికి కావలసిన ఆహారాన్ని పండించేదెవరు? అందుకే రైతు రేషనింగుబ్రతుకు ఎంత దుర్లభమైనా పనిచేసి పండిస్తాడు. ఎంత ఆదర్శజీవి!

అంతా రేషనింగుగూర్చే చెప్పుకొనిపోతున్నా. - అసలు కథకుగాలేదు. కథకేముంది, ఆ నాటిరోజుల్లో ఒకానొక అభాగ్యపు రైతు కుటుంబపు గాథ ఈ కథ. ఆ గ్రామమంత చిన్నదీకాదు, పట్టణమూగాదు. పురోభివృద్ధి చెందుచున్న పెద్ద గ్రామములేక చిన్నపట్టణము. ఆ గ్రామములో కొండయ్యమోతుబరిరైతు. వ్యవసాయములో నాటికి ఉన్నవారిలో యీతనికన్న అనుభవశాలులెవ్వరూలేరనవచ్చును. కొండయ్య చిన్న తాటియాకుల ఇల్లు పట్నంపోయే పుంత మొగలోఉన్నది. పుంతకిరు ప్రక్కల పెద్ద బీడులు. - అచ్చటనే గ్రామస్థులంతా వారివారి దూళ్లను మేపుకుంటారు. కొండయ్య ఇంటి ముందు, పుంతకిరు ప్రక్కల పెద్దపెద్ద వృక్షాలుగలవు. అవి పక్షులకు నివాసము, మనుష్యులకు నీడ నిత్యము యిస్తవి. గొడ్డకాడ బుడ్డోళ్ళంతా పుంత ప్రక్కబీడులో

మందవేసి చెట్లక్రింద గోళీలు, గూటీ బిళ్ళలు మొదలగు ఆటలు ఆడుకుంటారు. చివరికి వాళ్ళ మకామంతా కొండయ్య ఇంటిదగ్గరనే.

కొండయ్య అయ్య ఆ గ్రామపు పెద్ద భూస్వామిది పదెకరాల మాగాణీచేస్తూ, ఆదేకొండయ్యచేతికిచ్చి తనదారిని తాను వెళ్లిపోతాడు. కొండయ్య ఏ పొలమెవరిదో, ఏది ఎంతసత్తువకల్గి ఉందో, ఆది ఎంత కిమ్మత్తుచేస్తుందో ఎచ్చటఅడిగినా చెప్పగలడు. అంతేనా? ఆగ్రామంలో ఎవరైనా పొలం అమ్మాలన్నా పొలంకొనాలన్నా కొండయ్య దగ్గరకు రావలసిందే. కొండయ్య వంటెత్తువాడగుటచేత భార్య సహాయముతో పదెకరాలుమాత్రమే చేయగల్గుతున్నాడు. 'ఎంత పెరిగినా గొర్రెకు జత్తెడేతోక అన్నట్లు' కొండయ్య ఎన్నాళ్లు శ్రమించినా ఫలితం కన్పించడములేదు. పండినదంతా అంబారీ క్రింద పట్టుకొని వెడతాడు భూస్వామి. ఏమన్నా మిగిలితే బాకీ క్రింద జమకట్టుకుంటాడు. అంతటితో వదలుతాడా, 'మరి వడ్డీమాట?' అని సుదీర్ఘముగ ప్రశ్నిస్తాడు. కొండయ్యచూస్తూ పొలం వదలుకోలేడు, ఏముంది అయ్యచస్తూ ఊరికే ఇచ్చినట్లు చేసికోమన్నాడు. కాకపోయినా ఏవడ్డీకో అవుసరమైతే ఆదుకుంటున్నాడు భూస్వామి. లేకుంటే తమని ఆదుకొనే వారెవరు. అంతాతనలాంటివారే.

కొండయ్య వంటెత్తువాడను కోవడానికి సంతానములేకపోలేదు. పదునారేండ్లపిల్ల, ఏడు, నాలుగేండ్ల యీడుగల పిల్లలు. వీరేవారి సంతానంలోపోగా మిగినవారు. కొండయ్య భార్యను వెంటబెట్టుకొని పొలం వెడితే పెద్దపిల్ల చిన్నాడిని వెంటవేసుకొని ఇంటిపనులు చక్కబెడుతుంది. పెద్దవాడు దూళ్లను ఓళ్లలోకి వదలి తక్కిన కాపరులతో కాలంగడుపుతాడు. ఇది ఆ సంసారంలో నిత్యకృత్యము.

కొండయ్య నాలుగు రాళ్లు వెనకేసుకుందామన్నా వీలులేకుండా ఉంది. అసలే కరువుగోజులు, కూలిహెచ్చు. హెచ్చుకూలి యిచ్చిచేయించే

తాహతు లేదు. చేయిస్తే తప్పక బాకీ పెరుగుతుంది. బాకీ పెరిగితే సంసారము కూలుతుంది. రెక్కాడితే డొక్కాడు తుందన్నట్లు ఏలాగైనా కష్టపడి పండించాలంటాడు కొండయ్య. అందుచేత తోటి రైతులను తీసికొనివచ్చి పనిచేయించుకొని మరల వచ్చిన వాళ్ళందరకు బదలాయింపు వెడతాడు. ఇలా వెళ్ళడములో పనులరోజులు పూర్తవుతాయి. ఏ కొద్ది మాత్రమో వస్తుంది. అంతా సంతకే చాలదు; ఇంక నిలవేమిటి? పెద్దమనిషయిన పిల్లదానికి పెళ్ళిచేయాలని రెండేళ్ల నుండి ప్రయత్నం. దైవయత్నం ఎట్లాఉందో కాని కుదరలేదు. కుదిరితే చేయడానికి డబ్బులేదు. ఎప్పటి కప్పుడే తలకుమించిన అప్పు ఎదుట కనిపిస్తోంది. పాపం భూదేవిని నమ్ముకొనిఉన్నాడు కొండయ్య. ఎప్పటికైనా తనకోరిక ఫలిస్తుందని ఆశ. ఎప్పుడైనా భూస్వామి యింటికి వెడితే, కనిపించిందేతడవుగా, "కిరసనాయిలు, పంచదార, బట్టల చీటీలు తెచ్చేవా" అని అడుగుతాడు. ఇన్నియిచ్చి కొంతసేపు చాకిరీ చేస్తేగాని అడిగినదాంట్లో అర్ధపుట్టదు కొండయ్యకు. కొండయ్య ఇంట్లో కిరసనాయిలు దీపము వెలిగించి ఎన్నినాళ్లయిందో? బాకీగా కొలచేవడ్లకు ఇన్నిలంచముగా యివ్వాలి. లేకుంటే అంతే! శూన్య హస్తాలు చూపెడుతాడు వచ్చినవాళ్లందరకు.

కొండయ్య మంచి దృఢకాయుడు. పల్లెటూరులందలి సకల విద్యలందు ఆరితేరినవాడు. అంటే సాముసందగ్రగణ్యుడని చెప్పాలి. ఎందుకంటే ఈ గ్రామానికి ప్రక్కగ్రామాలకి తగాదాలు వచ్చినవంటే ముందుంటాడుకొండయ్య. కొండయ్యకు వారంనుండి సుస్తీగాఉంటోంది. మోటు మనిషిగాబట్టి సరకుచేయడు. అది పెద్దగా పరిణమిస్తుంది. పొలంవదలి మంచము పడతాడు. చిట్కావైద్యాల దగ్గరనుండి గ్రామములోనున్న పెద్ద డాక్టరుగారి ఇంగ్లీషుమందులుగూడ వాడుతారు. కొద్ది దినాలకే తగ్గినట్లు కనిపిస్తుంది. అంచేతనే డాక్టరు పాతబియ్యపుజావ ఇవ్వమం

టాడు. కొండయ్య భార్య పెద్దకొడుకు వెంకన్నను భూస్వామి యింటికి వెళ్ళి పాతబియ్యము తవ్వెడడిగి తీసికొనిరమ్మంటుంది. వెంకన్న పరుగునపోయి భూస్వామి వాకిలి ముందర వ్రాలతాడు. 'ఏరా? అంటాడా భూస్వామి. తల్లి చెప్పమన్నది చెపుతాడు వెంకన్న. ఈ నెల రేవు నింగుచీటీలు తెచ్చేవుగావు అంటాడు భూస్వామి. వాళ్లంతా విచారం లోమునిగియుంటే రేవనింగుచీటీలంటాడు. అలా నేనండి చెప్తానండి అంటాడు వెంకన్న. చెప్పడమేమిటి, తీసుకొనిరా అంటాడతను. బియ్యం ఇప్పించమంటాడు కుర్రాడు. పెళ్లాం అనుమతిమీద మూలుక్కుంటూ, ఎంతో వృథాగా ధార పోసేవాడిలా ముష్టిమూడు గిద్దలు యిచ్చి పొమ్మంటాడు.

ఇచ్చినదే తడవుగా పరుగునవచ్చి తల్లికి అందిస్తాడు వెంకన్న. వాళ్లయ్య దగ్గరకువెళ్లి భూస్వామి చెప్పమన్నది చెప్తాడు. కొండయ్యకు క్రోధము, ఆక్రోశము హెచ్చుతుంది. గొడ్డ కాడోళ్లతో కలసిపుంతలోకి వెళ్ళి పోతాడు వెంకన్న. "పెద్దోడా" అంటాడు కొండయ్య. ఎచ్చట నుండి జవాబురాదు. 'కష్టాలో నేనుంటే కొడ్డులుకావాలంట వీడికి! ఇల్లు, చుట్టాలు, పిల్లలుఉన్న తక్కినవారు మనుషులు కారేం - ఇంకా నయం బియ్యపుచీటి తెమ్మనలేదు. ముష్టిగ మూడుగిద్దలిచ్చేడు "అని తనలోనున్న క్రోధాన్ని వెలిబుచ్చుతూ ఆవేశంగా మాట్లాడుతాడు కొండయ్య. ఆవేశంలో ఒగరపు, దగ్గు వస్తుంది. పొయ్యిమీద జావవదలి పెట్టి భార్యవచ్చి ప్రశ్నార్థకముగా భర్త వంకచూస్తూ నిలబడుతుంది. కొండయ్యను జావ త్రాగమన్నారుగాని జ్వరం ముంచెత్తుకొని వస్తుంది. ఇలా మౌనముగా వాళ్ళిద్దరి మధ్య కొంతకాలము గడుస్తుంది. నీళ్లు కళ్ళిన పిల్లవచ్చేసరికి పొయ్యిమీద జావకుండ నేలకొరుగుతుంది. గదిలోకి పెద్దాడు అన్నం అంటూవస్తాడు. మీనాన్న జావతాగరు అది నీవేత్రాగు అని చెబుతుంది తల్లి. అక్క పెడుతుందికదాని అక్కడికివెళ్ళేసరికి నేలది ఎత్తుతుంటుంది వెంకన్న అక్క. తొందరగా

వచ్చిబావ వలికిందని చెప్పబోతాడు వెంకన్న. కాని తల్లి వాడినుండి మాటరాకముందే డాక్టరుగారిని పిలుచుకొని రమ్మంటుంది.
వెంకన్న రోడ్డు వెంబడే పరుగెత్తుకుంటూ ఆసుపత్రికి చేరుకుంటాడు. తీరావెళ్లేసరికి డాక్టరుగారి గదిగొళ్ళెనికి బరువుగా వ్రేళ్ళాడుతుంది తాళపుకప్ప. ఎవరికి తెలుస్తుందని అడగటానికి? ఇంటికి వెడదామా అంటే తిరిగేవేళ ఇంటి దగ్గరుండరు. మరెచ్చట దొరకును? అదిగో ఎవరోవస్తున్నారు వాళ్ల నడిగితే తెలీదూ! తీరావాళ్లను అడిగేసరికి ఇంటికి వెళ్లమన్నారు. ఇంటికి వెళ్ళినిరాశతో తిరిగివస్తుంటే 'మాధూ స్వామి?' యింటికి వెళ్లు అనిచెప్తారు. పరుగున పోతాడు వెంకన్న. అక్కడికి వెళ్లేసరికి యక్షప్రశ్నలువేసి పట్నం వెళ్తానన్నారు అనిచెప్పి పంపుతారు. తల్లి డాక్టరు గారేరంటుంది. జరిగినది పూసగ్రుచ్చినట్లు చెప్తాడు. చిన్న నాటువైద్యుల్ని పిలిపిస్తుంది తల్లి. వాళ్లంతా ఏవో మందులు వేస్తారు, పూస్తారు, త్రాగిస్తారు; ఏదోకొద్ది ఉపశాంతి కలుగుతుంది. మాగన్నుగా నిద్రిస్తాడుకొండయ్య. గొడ్డుకాడబుడ్డోళ్లంతా యిక్కడే ఉంటారు. ఇక తోటిరైతుల మాటవేరే చెప్పనవుసరములేదు. పల్లెటూళ్ళయందు ఆదరణ స్వభావము అందరిలో ఉంటుంది. కొండయ్య ఒకనాటి పరిచితుడుకాడు, ఒకనాటి మంచివాడు కాదు. జీవితమంతా శ్రమించి పనిచేస్తూ తోటి వారికి సలహాలిచ్చేధీశాలి. అంతా వ్యవసాయము చేసినా, ఏది చేసినా అందుకొందటికే దానిలోని లోటుపాట్లు తెలియును. అదే ఇతనిలో ఒక ప్రత్యేకత. అంతా దానినే పొందేలాచూడాలి. అదేకొండయ్య విశిష్టత. కాని తనవారిని ఋణవిముక్తుల్ని చేయడానికి తగిన ఆలోచన చేయలేకపోయాడు. అదే తనకు చేతగాని పనిగా ఉంది.

వచ్చిన వాళ్లంతా ఏవేవో చెప్పుకుంటూ చెట్లక్రింద అరుగుల మీద కూర్చున్నారు. అచ్చట నున్నవారంతా డాక్టరుగారి రాకకై ప్రతీక్షించుచున్నారు. అల్లంతదూరానకూడ, ఇసుమంతయినా డాక్టరుగారి

రాక కన్పించ లేదు. నెమ్మదిగా గొడ్డ కాడబుడ్డోళ్లంతా తమతమ మాళ్లను తోలుకొని వెళ్లిపోతున్నారు. సంధ్య వెలుఁగంతా సన్నగా క్షీణిస్తుంది. భార్య నానబెట్టిన వత్తులు తీసి మూడు ప్రమిదలలో చమురుపోసి వెలిగిస్తుంది. పుంతలోనున్న వాళ్లందరకు వో చిన్ని దీపము ఆకాశంలోని చిన్ని నక్షత్రంలా మిణుకుమిణుకు మంటూ కన్పించును. పోసిన కొద్ది చమురులో కొంత ప్రమిద పీల్చుకుంది. మిగిలిన కొద్ది మాటల్లో కాలిపోయినది. పిల్ల వచ్చి వత్తి ఎగద్రోసి చమురు వేసి వెళ్లుతుంది. అంతా మౌనముగా ఉంటారు. డాక్టరుగారు వచ్చేరని కబురు వస్తుంది. అంతలో ఒకడు వెళ్లి తీసికొని వస్తాడు. డాక్టరుగారు వచ్చి ఊరికే వెళ్లడమెందుకనేమో ఏదో ఒక పోటు పొడిచి, విశ్రాంతి తీసికోనివ్వండి అని చెప్పి బయటకు వస్తారు. బయటి వాళ్లంతా డాక్టరుగారిని వెంబడిస్తారు. మరల వస్తానంటారు డాక్టరు. మళ్లీ కబుర్లలో పడతారు.

ఇంట్లో చిన్నవాడు నిశ్చలంగా నిద్రిస్తుంటాడు. పెద్దవాడు కాస్సేపు వీధిలో, కొంత తడవు ఇంట్లో. పెద్దమ్మాయి వచ్చే పోయేవారి వంక చూస్తూ నిలబడి ఉంటూ కావలసినవి అందిస్తూంటుంది. తల్లి భర్త మంచం దగ్గరే ఉండి సేవ చేస్తుంది. మళ్లీ వస్తానన్న డాక్టరు రాకకై వేచియుంటారు అంతా. ఇంట్లో చమురందని వత్తులు ప్రమిదలను అంటుకొని చిన్నగా వెలుగుతుంటాయి. ఇది ఎవరూ పట్టించుకోరు. ఈదర గాలి వీస్తుంటుంది. ఈ గాలి ఒక్కసారిగా చమురందని వత్తులను ఆర్పివుంటూ లోనికి చొరబడుతుంది. ఒక్క నిండు నిట్టూర్పు విడుచుతూ నిండు ప్రాణాల్ని ఆ గాలిలో వదులుతాడు కొండయ్య. ఇంటిలో మంచము దగ్గరున్న వాళ్ళంతా చమురందని వత్తుల్లా నేల కూలుతారు. అంతా ఒక క్షణకాలంలో జరిగిపోతుంది. వీధిలో వాళ్ళంతా ఒక్కుమ్మడిగా ఎదురు వచ్చే గాలిని త్రోసుకుంటూ లోనికి వస్తారు - ఏముంది లోన? ఎంతమంది వచ్చినా వెళ్ళే గాలిని ఆపు చేయగలిగారా!

'స్వర్ణ'

# ఆంతర్యం

''యాందిది? ఒంటరిగనున్ననని సూసి సెయ్యట్టుకున్నవా ఏంది? ఈ నిప్పచ్చరపు పనులన్నీ మీమీ మేడల్లో కాని మాకాడ సాగవు. కొంచెం జాగ్రత్తగుండండి. మావోడితో సెబితినా ఒళ్లు హూనంసేస్తడు.''

లచ్చిమాటలికి జకరయ్యా నివ్వెరబోయాడు. ఏమనడానికీ నోరాడలేదు. అట్టాగే విగ్రహంలా నిలబడిపోయాడు. లచ్చి కూరగాయల బుట్ట నెత్తినెట్టుకుని చకచకా వెళ్లిపోయింది.

సన్నగా చినుకు పడుతూనే ఉంది. ఆకాశంలో తెలిమబ్బు వేసేటట్టుంది. జకరయ్యా సిల్కు లాల్చీ తడిమిచూసుకున్నాడు. కొంచెం తడిసింది. గబగబా అడుగులు వేసుకుంటూ ఇంటివేపు నడిచాడు.

''ఆసేమిటబ్బా'' లచ్చి అలాగంది. చేలోపడి దొంగతనంగా కూరగాయలు కోస్తున్నదికాక మాటలు కూడా అంటే. దాని సిగతరగా ఎంత పొగరో దానికి. దొంగముండ.''

జకరయ్యా ఆలోచించుకుంటూనే ఇల్లుచేరాడు. రెండు చెంబుల నీళ్లతో కాళ్లు శుభ్రంగా కడిగేసుకుని లోపలికి వెళ్లి సిల్కు లాల్చీ విప్పి ఒంకిన పదిలంగా తగిలించాడు.

జకరయ్యా ఆ వూరిలోని షావుకారుల్లో ఒకడు. తండ్రికి ఒక్కడే కొడుకు కావడంవల్ల గారాబంగా పెరిగాడు. దాంతో పొగరబోతుతనం బాగా అలవాటయింది.

జకరయ్యా వయస్సులో ఉండగా ఊరంతటనీ హడలగొట్టేవాడు. జకరయ్యాని చూస్తే ఆడవాళ్లంతా హడలిపోయేవాళ్లు. నలభయ్యేళ్లు దాటినా ఊళ్ళోవాళ్లకి జకరయ్యంటే భయంపోలేదు.

జకరయ్యా అసలుపేరు చక్రధరరావు. తండ్రి ముద్దుగా చక్రయ్యా అని పిల్చుకునేవాడు. ఊళ్ళోవాళ్లు దాన్ని జకరయ్య క్రింద మార్చేశారు. ఇప్పుడు జకరయ్యా తనపాతపేరు మర్చిపోయాడు.

సన్న చినుకు రాలుతుండగా చేను చూసొద్దామని బయలుదేరాడు జక రయ్య చేతిలో కొంకి కర్రతో. బీరతోటల్లో చేలు పచ్చగా చక్కగా కళ్లకు నిండుగా కనిపిస్తున్నాయి.

పిచ్చిముండ లచ్చి జకరయ్యను చూడనే లేదు. తనపని తాను చేసుకుం టూనేఉంది. జకరయ్య కోపం కొద్దీ లచ్చిచెయ్యి గట్టిగా పట్టు కున్నాడు.

లచ్చి జకరయ్యనుచూసింది. కాని భయపడలేదు. జకరయ్య సంగ తంతా లచ్చికి తెలుసు. ఒంటరిదాన్నిచేసి చెయ్యిట్టుకుంటాడా ఆడ దాన్ని అనుకుంది. నాలుగుమాటలూ అనేసింది.

లచ్చి మరోలా అభిప్రాయపడింది. కాని నిజానికి ఆక్షణంలో జకరయ్య మనస్సులో కోపం తప్ప మరేమీ లేదు. మరోక్షణానికి వేరేఉద్దేశం కలిగేదేమో చెప్పలేం.

లచ్చి తక్కువకులంలో పుట్టినా చాలా అందంగా ఉంటుంది. అందుకే ఊళ్ళోయువకులు దానివెంట పడతారు. లచ్చి కిదంతా అలవాటే కాని ఎవరికీ లొంగేఘటంకాదు.

లచ్చి మొగుడు గుర్రబ్బండితోలి అంతో ఇంతో తెస్తాడు ఇంటికి. లచ్చి కూరగాయలు కొని అమ్మో, దొంగతనంచేసి అమ్మో డబ్బు తెస్తుంది. మొగుడంటే లచ్చికి చాలా ఇష్టం.

తన మొగుడు ఎవరికీ లొంగేఘటం కాదని లచ్చికి గర్వం. సాటివాళ్ళలో ఆమాట పదేపదే చెప్పకుంటుంది. నిజానికికూడా లచ్చిమొగుడు ఇంత వరకు ఎవరికీ లొంగి బ్రతకలేదు.

జకరయ్య అహం దెబ్బతిన్నదనే చెప్పాలి. లచ్చి అన్నమాటల్ని గురించి తీవ్రంగా ఆలోచించాడు. ఆ ఆలోచనలు అతనిలో చాలామార్పు తెచ్చి పెట్టాయి.

జకరయ్యలో పొగరుబోతు తనం పూర్తిగా అడుగంటి పోయింది. ఎవరినీ లెక్క చెయ్యని జకరయ్య నౌకర్లను సైతం దయగా ప్రేమగా చూడ నారంభించాడు.

ఒకరోజున నౌకరు పాలు తెస్తుండగా చెయ్యి జారింది. పాలు పోయినాయి. గ్లాసు ముక్కలు ముక్కలైంది. ఇదంతా జకరయ్య చూశాడు. నౌకరు భయంతో వణికిపోయాడు. ఇదివరకైతే జకరయ్య ఆనౌకర్ని తన్ని కొట్టి అపూటకి తిండిలేకుండా మాడ్చి చంపేవాడు. కాని ఇప్పుడలా చెయ్యలేదు. "ఇంకో గ్లాసులో పాలు తే" అన్నాడు నెమ్మదిగా.

మరొకరోజున గొడ్లకాడ నౌకరు గొడ్లను చేనుకాడ మేపుతూ అద మరచి నిద్రపోయాడు. గొడ్లు పైరపాదులన్నీ తొక్కి పాడుచేశాయి. జకరయ్య చూసి వాడిని లేపాడు. నౌకరు నిలువెల్లా కంపించి పోయాడు. ఇంకేముంది. ప్రాణంపోయినట్టే అనుకున్నాడు. కాని అలాజరగలేదు. "గొడ్లను తోలుకుపోయి కట్టెయ్యి" అన్నాడు జకరయ్య మెల్లగా.

జకరయ్య ఎక్కువగా బజార్లో తిరగడంలేదు. ఒకవేళ పనిఉండి తిరిగినా ఇదివరకటిలా దిక్కులుచూస్తూ దొంగచూపులు చూడడం లేదు. తనదారిన తాను పోతున్నాడు.

ఊళ్ళో ఆడా మగా అంతా జకరయ్యలో మార్పుచూసి ఆశ్చర్య పోయారు. ఊళ్ళో కొందరుకలిసి చంపుతామని బెదరించినా రాని మార్పు జకరయ్యలో ఇప్పుడెలా వచ్చిందో అనుకున్నారు. ఇప్పుడు జకరయ్యని ఊళ్ళోఅంతా గౌరవిస్తున్నారు. ఆడవాళ్ళు చూడ గానే పాడలిపోవడం మానివేసి మెల్లగా అతనినిగురించి కబుర్లాడు కోవడం సాగించారు. వాళ్ళలోనూ కలిగింది మార్పు.

జకరయ్య మనస్సులోంచి లచ్చిరూపు తొలగిపోలేదు. అతడంతకుముందు లచ్చిని అంతగా పరిశీలించి చూసిందిలేదు. ఎంత అందంగా ఉంది! కాని అదన్నమాటలో—

జకరయ్య ఆలోచించుకుంటూనే ఉన్నాడు అప్పుడప్పుడూ - ఏమన్నదీ "మావోడితో సెబితినా ఒళ్ళు హూనంసేస్తడు." జకరయ్య నవ్వుకున్నాడు తనలో.

లచ్చి మొగుడు అంజిగాడికోసం కబురంపాడు జకరయ్య బండితోలుకు రమ్మని. తానారోజు పట్నం వెళ్ళాలని ప్రోగ్రాం వేసుకున్నాడు ఇంట్లోకి కావలసిన సామానదీ కొనాలి.

పట్నం ఊరికి రెండుమైళ్ళుంది. ఊళ్ళో ఇంతవరకు వీడి దొక్కడిదే గుఱ్ఱబ్బండి. కాని ఈ మధ్య మరో కొత్తబండి వెలిసింది అద్దంత రంగా. అది పొరుగూరుది.

ఒక్కడూ ఉండగా అంజిగాడికి కూలి సరిపడాదొరికేది. కాని ఇప్పుడు దొరకడంలేదు. తనదసలే పాతబండి. ఎవరెక్కుతారు. రోజులికి రోజులు పస్తులే ఉంటున్నాడు.

"ఏంది దొరా రమ్మన్నరంట" అంజిగాడు నల్లగా బొద్దుగాఉన్నాడు. జకరయ్యవాడిని చూసి ఆశ్చర్యపోలేదు. లచ్చికి అన్నివిధాలా తగిన వాడే వాడూను.

"షావుకారుగారు కొత్తబండి వూళ్ళోఉండగా పాతబండి వాడిని తనని పిలిచాడేమా" అని అంజిగాడు ఆశ్చర్యపోయాడు. పైగా ఈయనిదివర కెన్నడూ బండిమీద పట్టంపోయిన పాపాన పోలేదు.

జకరయ్య అంజిగాడి వంకచూసి మెల్లగా నవ్వి - "అంజీ! ఇదివర కెన్నడూ నేను బండిమీద పట్నం వెళ్ళలేదు. ఇప్పుడు వయస్సుమీరింది. కాలంమారింది. తప్పక పిల్చా" అన్నాడు. "మీకోసం కాకపోతే మరెంకోసం బాబూ బండీ! ఉండినోరు కాకపోతేలే నోరు ఎక్కుతారా? ఎక్కండి. ఎక్కండి." అని తొందరచేశాడు అంజిగాడు.

తయారై కూర్చున్న జకరయ్య గబగబా బండెక్కాడు. కొద్దిరోజు

ల్నించీ పని లేదేమో గుఱ్ఱం తిండికి అలవాటు పడిపోయి నడవడం మానేసింది. అంజి కొరడా దెబ్బలు వేస్తున్నాడు.

జకరయ్య ఏదో ఆలోచిస్తున్నాడు. అంజిగాడితో ఏమో మాట్లాడాలని ఉద్దేశ్యం, కాని ఏంమాట్లాడాలో మాత్రం అర్థం కావడంలేదు. నిజానికి వాడితో తనకేంపని?

బండి పట్నంచేరేవరకు ఎవరూ ఏమీ మాట్లాడలేదు. అంజిగాడు బండి తోలేపనిలోనే పూర్తిగా మునిగిపోయాడు. జకరయ్య ఏంమాట్లాడాలా అని ఆలోచనలో ఉండిపోయాడు.

పట్నంలో కూడా అటూఇటూ తిరగడానికి జకరయ్య అంజిగాడి బండినే ఉపయోగించుకున్నాడు. కావలసిన పనులన్నీ చూసుకున్నాడు. సామాను కొనుక్కున్నాడు.

జకరయ్యకు నిజానికి పట్నంలో కూరగాయలు కొనవలసిన పనిలేదు. కావలసిన ముఖ్యమైన కూరగాయలన్నీ తన స్వంత దిబ్బమీదనే పండించుకుంటాడు. కాని జకరయ్య బండిని కూరగాయల మార్కెట్టుకు పోనీమన్నాడు. అంజిగాడు గుఱ్ఱాన్ని అదిలించాడు. ఐదునిమిషాల్లో బండి మార్కెట్టుచేరింది.

రకరకాల కూరగాయలతో మార్కెట్టు ఆకర్షణీయంగా ఉంది. ఐనా జకరయ్య బండిదిగి ఏ దుకాణందగ్గరకీ వెళ్లకుండా అటూఇటూ చూస్తూ నిలబడిపోయాడు.

“అట్ట సూత్తరేంది దొరా? బోలెడన్ని దుకాణాలెదురుంగా కనిపిస్తుండాయి. ఏడనో కొనకూడదా? ప్రొద్దెక్కుతుండాది” అన్నాడు అంజిగాడు ఆకలి కరకరలాడుతుండగా జకరయ్యతో.

జకరయ్య తనతోరమ్మని అంజిగాడికి సైగచేసి ఒకవైపుకు దారితీశాడు. జకరయ్య, అంజిగాడూ కూరగాయల మార్కెట్టులో ఒకప్రక్కకు చేరారు.

లచ్చి తట్టలో కూరగాయలు క్రిందపోసి అమ్ముతోంది. ఆ ప్రక్కనే కూర గాయలు కొనేవాళ్ళు ఎక్కువగా ఉన్నారు. జకరయ్య అంజిగాడితో అక్కడికి వెళ్ళాడు.

"చూశావురా అంజీ! లచ్చిబేరం మా బాగుందిలే. మార్కెట్టులో అంతా లచ్చిదగ్గరే కొనడం! జకరయ్య ఎగతాళిగానూ, సంతో షిస్తున్నట్టూ అన్నాడు.

అంజిగాడు చూశాడు. లచ్చిచుట్టూ చాలామంది ఉన్నారు. కొందరు దానివైపు తదేకదృష్టితో చూస్తున్నారు. అంజి అటునించి దృష్టి మరల్చాడు జకరయ్యవంక. "తొరగా కూరలు కొనండి బాబూ, ఆకలే స్తుందాది. తొరగాపోవాలా." అంజి పైమీది తుండుగుడ్డ దులుపు కుంటూ అన్నాడు జకరయ్యతో.

ఇంతజరిగినా లచ్చి వీళ్ళను చూడనేలేదు. బేరసారాలు చేసేవాళ్ళ చాటున వీళ్ళు కనిపించలేదు.

జకరయ్య ప్రక్క దుకాణంలో కూరగాయలు బేరంచేస్తూ కొన నారం భించాడు. వీలైనంతవరకు కొనడంలో ఆలస్యం చెయ్యాలని అతని ఉద్దేశ్యంలాగుంది. జకరయ్య కూరగాయలు కొంటున్నంతసేపూ అంజి గాడు లచ్చివంక చూస్తూనే ఉన్నాడు కాని దగ్గరకువెళ్లి మాట్లాడించ లేదు. లచ్చికూడా వీడిని చూడనేలేదు.

కూరగాయలు కొనడం ఐపోయింది. అంజిగాడు మూట బండిలో వేశాడు. జకరయ్య అటూ ఇటూ చూస్తూ బండెక్కాడు. చివరిసారి లచ్చివంక చూశాడు.

అంజికూడా బండెక్కి కోపంకొద్దీ గుఱ్ఱంవీపుమీద కొరడా ఝుళ్లువుని పించాడు. ఆకోపం నిజానికి గుఱ్ఱంమీదనో మరొకరిమీదనో—

బండి సాగిపోయి ఊరికివెళ్లే రోడ్డెక్కింది. "అంజీ! లచ్చిబేరం

చూశావుగదటరా! రోజూ డబ్బులు బాగా చిక్కుతున్నాయా'' అని అడిగాడు జకరయ్య.

''ఏం చిక్కడమో బాబయ్యా! పాతువృత్తి. అది అంత తిప్పలుపడినా నాలుగుడబ్బులు మిగలవాయె. బండికి కిరాయి దొరకడమే లేదు. ఎట్ట సచ్చేది!''

జకరయ్య ఈ మాటల్నివిని బిగ్గరగానవ్వాడు. ''అంత డబ్బులు మిగలని కాడికి రోజూ దాన్ని నలుగురిలో చావగొట్టడం దేనికిరా'' అన్నాడు జకరయ్య మామూలుగానే.

''అదీ లేంది బువ్వెట్టా దొరుకుతాది! పొట్టకోసం ఏందో తిప్పలు పడాలిగా సామీ'' అన్నాడు అంజి ఏదో బాధని లోలోపలే దిగమింగుకుంటూ.

''దాన్ని చావగొట్టడ మెందుకుగానీ - ఒరే అంజీ! నామాటవిను. దాని వృత్తిని మానిపించు. నువ్వు నాకాడ ఏదోపనికి కుదిరిపో. సరిపడా ఇస్తాను.''

జకరయ్య మాటలికి అంజిగాడి మొఖం వికసించింది. కృతజ్ఞతతో నిండిన ముఖంతో అతనివంక చూశాడు. నాకాడ నీకేమీ లోటుండదురా'' అన్నాడు జకరయ్య.

''సరే బాబయ్యా. అట్ట నేసేత్తా. ఈ పాతగుఱ్ఱబ్బండితో కూలిలేకండా ఎన్నాళ్లని చావను.'' అంజి ఆలోచిస్తూ నెమ్మదిగా అన్నాడు.

బండి ఊరుచేరింది. ఇంటిముందు దిగి రెండురూపాయలు అంజిచేతిలో పెడుతూ ''రేపటినించి పనిలోకి రారా'' అని జకరయ్య విసురుగా లోపలికి వెళ్లిపోయాడు.

అంజి రెండురూపాయలు చూసి ఆశ్చర్యపోయాడు. ''మారాజు'' అనుకుంటూ కూరగాయల మూటా సామానూ ఇంట్లోకి చేరవేశాడు ఒకటొకటిగా.

అంజి జకరయ్య దగ్గర పనిలో చేరాడు. రోజులు బాగానే గడుస్తున్నాయి. లచ్చి కూరగాయల బేరం మానేసింది. తనకు మానడం ఇష్టం లేకపోయినా అంజిగాడు ఒత్తిడి చేశాడు.

లచ్చికి అంజిగాడిలో మార్పు కనిపించింది. ఇదివరకు అంజిగాడు ఎవరికీ ఎన్నడూ లొంగి ఉండేవాడు కాదు. స్వతంత్రంగా బ్రతికేవాడు. కాని ఇప్పుడు అంజిగాడికి జకరయ్య ఎంత చెబితే అంత! జకరయ్య ఒక దేవుడైపోయాడు.

లచ్చి ఈ తేడాని గ్రహించింది. దాని మనస్సులో ఏవో ఆలోచనలు సుడిగుండ్లు తిరిగాయి. కొన్ని రోజులలా ఆలోచిస్తూ ఉండిపోయింది లచ్చి. ఏమిటో ఆ ఆలోచనలు!

ఒకరోజున సన్నగా వర్షం తుంపర పడుతుండగా జకరయ్య పొలంనించి ఇంటికి వెళ్తున్నాడు. ఇంతలో "దొరా" అని వినిపించింది. లచ్చి! ఎందుకు వచ్చిందో -

"ఆరోజు ఏందేందో కుయ్యారాని కూతలు కూశాను దొరా. తప్పు చమించండి. ఇప్పుడు మీ పాలేరు పెళ్లాణ్ణి. ఏంసెప్పినా సేత్తాను. కాదనను దొరా."

లచ్చి మాటలికి జకరయ్య నివ్వెరపోయినా తమాయించుకున్నాడు. లోలోపలే చిరునవ్వు నవ్వుకుని లచ్చికేసి వింతగా చూశాడు.

'జోస్యుల'

# ఆనాటి స్వప్నం

పరమానందం సామాన్యకుటుంబీకుడు. అతనికి సంతానంలేదు. పార్కుకి ఎదురుగానున్న రామానంద ప్రెస్‌లో గుమాస్తాపని చేస్తున్నాడు. ప్రొద్దస్తమానం ఆఫీసులోపని చేసిచేసి అలసి సాయంత్రం ఏ ఆరుగంటలకో అతను ఇంటికి జేరుకుంటాడు.

ఆ క్రిందటిరోజు ఆఫీసుకిసెలవు పెట్టడంవల్ల పరమానందానికి ఈరోజున పనిఎక్కువ అయింది. మిగిలిన వారంతా ఆరుగంటలకే వెళ్ళిపోయినా అతనుమాత్రం ఎనిమిది గంటలకుగాని ఇంటికి జేరుకోలేదు.

మామూలుగా పరమానందం ఇంటికి వచ్చేటప్పటికి అతని శ్రీమతి కలకలలాడే ముఖంతో స్వాగతంచెప్పేది. ఆరోజున ఎంతసేపునిరీక్షించినా భర్తజాడ కనిపించలేదు. ఆమె చాల నిరుత్సాహంతో బాధపడుతోంది. పరమానందం మాత్రం ఆనాటి శుభవార్త భార్యకెప్పుడు చెబుతానా అనే ఆనందోద్వేగంతో ఇల్లు చేరుకున్నాడు. 'శ్రీమతీ, శ్రీమతీ' అని రెండు మూడుసార్లు పిలిచాడు. భర్త పిలుపువినగానే ఆమె సంతోషంతోవచ్చి తలుపుతీసింది. అతని చేతిలోఉన్న ఏదో కాగితంవైపు ఆమెదృష్టులు ప్రసరించాయి.

అతను కాగితం తన శ్రీమతిచేతికి అందిస్తూ "నన్ను చిన్నగుమాస్తా గిరి నుంచి పెద్దగుమాస్తాగా మార్చారు. నాపనికి మెచ్చుకుని మాఆఫీసరు నాకు మంచిప్రమోషను ఇచ్చాడు. ఇకనుంచి జీతంకూడా మనకి ఎక్కువే" అన్నాడు ఆనందంతో. ఆమెకూడ సంతోషంతో "ఏమిటండీ జీతంకూడా ఎక్కువేనా? అయితే రేపటినుంచీ నామెడ నగలతో నిండిపోతుందన్న మాట ! మనం ఎంత అదృష్టవంతులమండీ!' అంది.

పురుషుడు పగలల్లా కష్టపడిపనిచేసి సాయంత్రానికి ఇల్లుజేరుకుటూంటాడు. ఇంట్లో భార్య పిల్లలు తనకి సంతోషంతో స్వాగతమివ్వాలని అతడు కోరుకుంటాడు. ఆ సౌఖ్యం లభించిననాడు తను అంతకు

ముందు పడ్డశ్రమ అంతా మరచిపోతాడు. స్త్రీలంతా అటువంటి వాళ్లయితే ఇంక వేరే చెప్పాలా ? భూలోక స్వర్గం కరతలామలకమైనట్టే. పరమానందం నిజానికి అదృష్టవంతుడే అని చెప్పాలి అఘడియవరకు.
రాత్రి భోజనంకాగానే పరమానందం వచ్చిపడుకున్నాడు. అతని శ్రీమతికూడ భోజనంచేసి అన్నీ సర్దుకుని వచ్చిపడుకుంది. చూస్తూండగానే ఆమెకి నిద్రపట్టింది. క్రమ క్రమంగా ఊరంతామాటు మణిగింది. అయితే పరమానందానికి మాత్రం ఆ రాత్రి ఎంత ప్రయత్నించినా నిద్రపట్టడంలేదు.
అతను ఆలోచిస్తూ ఆలోచిస్తూ అల్లాగేమంచంమీద పడివున్నాడు చాలాసేపు. ఆఖరికి అతిప్రయత్నంమీద అతనికి ఒంటిగంటా ఆ ప్రాంతంలో కొంచెం కలత నిద్ర పట్టసాగింది.

* * *

"అప్పుడే కనుచీకటిపడుతోంది. రాత్రి భోజనంచేసి ఆఫీసుకి అభిముఖంగా పోతున్నాడు పరమానందం. పని ఎక్కువగా ఉండడంవల్ల రాత్రి ఆఫీసుకివెళ్లి పనిపూర్తిచేద్దామనే ఆతుర్దా అతనిలో కనిపిస్తోంది. చాలాదూరం అల్లావెళ్లిపోయాడు. ఒకచోట గుబురు గుబురుగా అలుముకుపోయివ మొగలి పొదలు కనిపించాయి. ఆ పొదలకి ఎదురు భాగంలో ఏదో కొంగ వ్రాలిందా అన్నట్లు తెల్లగాకనిపించింది: పరమానందం దాన్ని బెదిరించడానికని గట్టిగా చప్పట్లు చరిచాడు. అదృశ్యం ఏమీచలించలేదు. అది కొంగకాదు - మొగలిపువ్వని నిర్ధారణఅయింది. ఆ పువ్వు పరిమళము 'జడివాన తుంపరల వలె దిక్కుల వెదజల్లబడి ఘ్రాణేంద్రియమునకు తియ్యని స్వర్గాన్ని కలుగజేస్తోంది. పువ్వును సమీపించిన కొలదీ పరిమళం ఎక్కువవుతోంది. దగ్గరికివెళ్లి చెయ్యివేసి త్రుంపబోయేటప్పటికి వెనుకవైపునుండి పెద్దపెట్టున అరపులు, కేకలు, ఏడ్పులు వినిపించాయి. అంతా అగమ్యగోచరంగా కనిపించింది.

పరమానందం వెనక్కి తిరిగి చూశాడు. మొగలి గుబురులో నుండి మిణుకు మిణుకు మంటూ ఒక దీపం కనిపించింది. తేరిపార చూడగా ఆ మిణుకు మనే దీపం ఒక భవనంలో నుండి కనిపిస్తూన్నట్లు తేలింది. అతను ఆ గుబురులో దూరి ఆభవనానికి అభిముఖంగా నడిచాడు. ఎంతదూరం వెళ్లినా ఆభవనం కనపడలేదు. అతికష్టంగాద అభవనానికి దగ్గరగా జేరుకోకలిగాడు-అందులోనుంచి ఒక స్త్రీ ఆర్తనాదం హృదయ విదారకంగా వినిపించింది. ఆర్తనాదంతో బాటు ఎవరివో కేకలుకూడ వినపడ్డాయి. 'రక్షించు - రక్షించు - పరమేశ్వరా, రక్షించు! ఈ దుర్మార్గుడు నన్ను బాధిస్తున్నాడు.' అంటూ అతి కరుణాజనకంగా ఆర్తనాదం దిక్కుల ప్రతిధ్వనిస్తోంది. ఆ కేకలు విన్న ఎంతటి కర్కోటక హృదయమైనా దయార్ద్రం కాక మానదు. అతను అతిధైర్యంతో భవనపు సింహద్వారం ప్రవేశించాడు. ఆమిణుకు మిణుకు మనే దీపం పై అంతస్థులో వెలుగుతోంది. ఎంత వెతికినా పై అంతస్థుకి వెళ్లేమార్గం కనిపించలేదు. పరమానందం అతిసాహసాన్ని ప్రదర్శిస్తూ గోడకి అక్కడక్కడ ఉన్నకంతల సహాయంతో పైకి వెళ్లాడు. ద్వారం దగ్గరనుంచి లోపలికి తొంగి చూశాడు.

మిణుకు మిణుకు మంటూన్న ఒక అముదపు దీపందగ్గరకూర్చుని ఒక యువతి విలపిస్తోంది. ఆమె గులాబీచెక్కిళ్లువాడి అశ్రువులచే మలినమైపోయాయి. నున్నని ఆమె చెక్కిళ్లపై అశ్రుబిందువులు పడి తామరాకుపై నీటిబిందువులవలె జారిపోతున్నాయి.

ఆమె వెనుక అతి సమీపంగా ఒక వికృతాకారుడు కత్తిచేతబట్టుకొని పళ్లు పటపటకొరుకుతూ ఆమెని ఖండ ఖండాలుగా చేసి పారేసేందుకు సంసిద్ధుడై ఉన్నాడు......'

పరమానందం భయంకర స్వప్నంలోంచి ఒక్కసారిగా మేల్కొని త్రుళ్లిపడ్డాడు. ఆర్తనాదంచేస్తూన్న యువతి అచ్చంగా తన శ్రీమతి పోలికలో ఉండడం జ్ఞప్తికివచ్చి అతని హృదయం జలదరించింది. కళ్లు

రెండు చేతులతో గట్టిగా నులుముకుని చూశాడు. తన శ్రీమతి మంచంమీద కూర్చుని నిజంగానే ఏడుస్తోంది. పరమానందం భయ విహ్వలుడై "ఎందుకిలా ఏడుస్తున్నావు?" అని అడిగాడు. ఆమె తన ఏడ్పుకి కారణం చెప్పింది—అతను నిద్రపోతూఉండగా రాక్షసాకారంతో ఉన్న ఒక భయంకర వ్యక్తి ఎవడో అతని కంఠం నరకేందుకు సంసిద్ధుడయ్యాట్ట! ఆదృశ్యం చూసి భయపడి కళ్ళుగట్టిగా మూసుకుందిట! మళ్ళీ కళ్ళు తెరిచీ తెరవడంలో ఆమెకి నిద్రమెలుకువ వచ్చింది.

ఇకే మొదలు - పరమానందం తన శ్రీమతిని ఒక్కక్షణంకూడ ఎడబాయక అంటిపెట్టుకుని ఉండసాగాడు - ఏమో! ఏక్షణం ఎటువంటిదో? ఏదో ముందు రాబోయే ఆపదను సూచించే ఆదుస్స్వప్నాలు వారి సుఖమయ దాంపత్య జీవితాన్ని దుఃఖభాజనంగా చేసేశాయి. తన శ్రీమతి కన్నీరు మున్నీరుగా ఏడుస్తూఉండగా చూసి పరమానందం ఏమిచేసేందుకూ తోచక విచారమగ్నుడయ్యేవాడు.

కాలక్రమంగా వాళ్ళు ఈ దుఃఖాన్ని కొద్దికొద్దిగా మరువజొచ్చారు. ఒకసారి కార్తిక పౌర్ణమినాడు ఊళ్ళో వాళ్ళంతా సముద్రస్నానాలకి వెళుతున్నారు. వలుగురితో బాటు వాళ్ళిద్దరూకూడ ఉత్సాహంతో సముద్ర స్నానానికి బయలుదేరారు.

అంతా సముద్రపుటొడ్డుచేరారు. ఒక్కొక్కరే సముద్రంలో దిగి స్నానం చెయ్యసాగారు. పౌర్ణమినాటి చంద్రుని అందుకోడానికా అన్నట్లుగా సముద్రకెరటాలు ఆకాశాన్ని అంటుతున్నాయి. పరమానందం అల్లాగేచూస్తూ గట్టుమీద నిలబడిఉన్నాడు.

అతని శ్రీమతి ఉత్సాహంతో సముద్రంలో మునకలెయ్యడానికని క్రిందికి దిగింది. ఆ పెద్దపెద్ద కెరటాల తాకిడికి తట్టుకోలేక ఆమె అడుగులు తడబడ్డాయి. శరీరం కంపించింది. నిలువలేక ఒక్కుమ్మడిని సముద్రంలో పడిపోయింది. అంతే, మళ్ళీపైకి కనిపించలేదు. పరమానందంకూడ ఆమెని పట్టుకోడానికి సముద్రంలోకి దూకాడు - ఎంత వెతికినా ఆమె దొరకలేదు. ఏదోభావోద్రేకం ఉరకలెత్తించగా అతను సముద్రగర్భంలో తన శ్రీమతి కోసం అర్రులు చాచాడు.

"మూర్తి"

## ఎడ్యుకేషన్

ఉద్యోగంకోరకు వెళ్లినవాడు ఎంత టిప్ టాప్ గా వుండాలి చెప్పండి? రాము అలా లేడు. స్వతహా మనిషి ఒక మోస్తరుగావుంటాడు. దానికి సాయం మూడురోజులనుండి భోజనంలేదు. స్నానంలేదు. తలదువ్వటం లేదు. మాసినబట్టలు విడవటంలేదు. అందుచేత మనిషి నీరసంగా ఉన్నాడు. అదీకాక రాముస్టార్ ఇంకా మారలేదు లెండి. తిరిగి తిరిగి నీరసంవచ్చేసి నడవలేని పరిస్థితిలోవుం అక్కడ కనిపిస్తున్న రాజకుమారి టాకీస్ వద్దకు చేరుకున్నాడు. అప్పటికప్పుడే రాత్రి 9 గంటలు అయిపోయింది. బాగా ఆకలి వేస్తూంది. పాపం ఏంచేస్తాడు. అక్కడ కనిపిస్తున్నసోడా కొట్టువద్దకు వెళ్లి కొంచెం మంచినీళ్లు ఇవ్వరూ? అన్నాడు. మంచినీళ్లులేవు సోడాలే కాని అని జవాబు ఇచ్చారు. అక్కడనుంచి ఒక కాఫీహోటల్ దగ్గరకువెళ్లి కొంచెం మంచినీళ్లు ఇవ్వరూ? అన్నాడు. వాళ్లుకొంచెం మంచినీళ్లు ఇచ్చారు. ఆ నీళ్లు త్రాగివచ్చి హాలుదగ్గరే కూర్చున్నాడు. ఇంతలో ఫస్టుషో అయిపోయింది. రాము కళ్లకు భిక్షమెత్తేవాళ్లు కూలిపనులుచేసేవాళ్లు కనిపిస్తున్నారు. ఇదంతాచూస్తూ ఆలోచించసాగాడు. ఇంతచదువు చదివి చూస్తూచూస్తూ భిక్షం ఎలా ఎత్తడం? పోనీ దానికి అంగీకరిస్తే, పోతులావున్నావు అడుక్కోకపోతే, కష్టపడి పనిచేసుకోరాదు? అని అంటారేమో; కష్టపడి పనిచేద్దామా అంటే కష్టానికి అలవడ్డవాడను కాదు. ఏమిచెయ్యాడమా అని ఆలోచిస్తూం ఆకలిబాధతో నిద్రకూడా వస్తున్నట్టు గ్రహించి పైమీది రుమాలుతీసి అక్కడే ఎవరికీ అడ్డులేని చోటపర్చుకు నిద్రపోయాడు. కొద్దిక్షణాల తరువాత సెకండుషోకూడా విడిచిపెట్టేశారు. జనం రష్ గా గెంటుకువస్తున్నారు. ఆ గొడవ మూలాన రాముకు మెలుకువవచ్చి లేచి రుమాలు దులిపి భుజంమీద వేసుకొని నిలబడ్డాడు. కొద్ది సేపటికి జనంరష్ తగ్గింది. ఆఖరున ఒక యువతి

లెదర్ హేండుబేగ్ ఒకటిచేతితో తిప్పుతూ బయటికివచ్చి సైకిలు రిక్షా ఒకటి పిలిచి, ఆ రిక్షామీద వెళ్తుండగా రాముచూచి, రిక్షాను వెంబడించాడు. కొద్దిదూరం పోగానే ఒక మేడ ఎదుట రిక్షాఆపి ఆమె దిగి వెళ్లిపోయింది. రాముకంటికి కనిపించే అంతదూరంలోవుండి చూశాడు. "ఈ పూట భోజనంకు సరిపడినంతే ఈమెవద్ద దొంగిలించాలి. అంతకంటే ఎక్కువ వద్దు, ఒకరి కష్టార్జితం మనజేబులో వుండకూడదు." అనిపించింది రాముకు.

విమల మేడమీద ప్రవేశించి తన బేగ్ డ్రాయర్‌మీదవుంచి సైటు డ్రెస్సు వేసుకుని డ్రాయరు ఎదురుగా వున్న మంచంమీద వాలి, ఆ వీధి అంతా నిశ్శబ్దంగా వుండటంగ్రహించి, ఇలా అనుకోసాగింది. "ఎన్నాళ్లు ఈ ఒంటరి జీవితం? తోడులేని జీవితం పాడు జీవితం అన్నారు పెద్దలు. ఇంక ఆలోచించటం అన్నది ప్రయోజనంలేనిపని... ధైర్యం కలదానిని కాబట్టి ఇంతకాలం ఇంతమేడలో, ఒంటరి జీవితం గడిపేను." అని అనుకుంటూ నిద్రపోయింది విమల. అప్పటికి సరిగా 3 గంటలు అయింది. రాము మేడక్రిందికి వెళ్లి తలపైకి ఎత్తిచూసే సరికి, ఎటూదారికన్పించలేదు. చూడగా మేడమీదవున్న వరండా. దాని ప్రక్కనుంచి క్రిందివరకు దిగివస్తున్నటి సిమ్మెంటుపైపు కన్పించింది రాముకు. ఇంక ఏమీకన్పించలేదు. తెగించి ఆ సిమ్మెంటుపైపు ఆధారంచేసుకొని వరండాలో ప్రవేశించాడు. విమల నిద్రలోవున్నట్టు గ్రహించాడు. లోపల ప్రవేశించగా ఎదురుగావున్న డ్రాయరుమీద పర్సు కనపడింది. పర్సు తీసి ఒక్క రూపాయి మాత్రమే తీసుకుని ఆపర్సు మంచంమీదవుంచి, ఆగదిలోనుంచే మెట్లగది చూచాడు. నెమ్మదిగా మెట్లగదిగాడ తీసుకుని. బయటకు ప్రవేశించి, తలుపులు దగ్గరగావుంచి, భోజనహోటల్‌కు బయలుదేరాడు. తీరా అక్క

డకు వెళ్లితే అక్కడ భోజనంలేదు. అప్పటికప్పుడే 4 గంటలు అయింది. అప్పుడు భోజనం ఏలావస్తుంది చెప్పండి పిచ్చివాడు కాకపోతే? ఆకలిమాత్రం జోరుగావుంది. అక్కడనుంచి ఒక కాఫీ హోటల్ కు వెళ్లి అక్కడఉన్నది ఏదో తృప్తికరంగా తిని రూపాయి చేతికిఇచ్చాడు. ఆ యజమాని తిరిగి ఒకబేడ ఇవ్వగా, దానితో సిగరెట్టు తీసుకుని కాల్చుకుంటూ తిన్నగా ఈమేడవద్దకే మరలచేరుకున్నాడు. ఎందుకో తెలుసా? రేపు ప్రొద్దుటిపూటకు కావలసింది మరల దొంగిలించడానికి. ఇక్కడ ఇంతలో విమల ఇటుఅటు కదలటంలో పర్సుచేతికి తగిలింది. ఉలిక్కిపడిలేచి ఆశ్చర్యంగా డ్రాయరు మీదవుంచిన పర్సు ఇక్కడికి ఎలావచ్చిందా అని, భయంగా ఆలోచించి, టైము చూచింది. అప్పటికప్పుడే 5 గంటలు అయింది. తెల్లవారుతూంది. ఇంతలో రాము మెట్లగదిలో ప్రవేశించి ఏదో చప్పుడు అయితే, ఆగదిలోనే తలుపు పక్కన దాక్కున్నాడు. విమల తెల్లవారిపోవచ్చింది కదా అని, నిత్యకృత్యాలు తీర్చుకోవడానికి, మెట్లుగది వద్దకువచ్చి, లైటు వేసేసరికి రాము కన్పించాడు.

"ఎవరు నీవు? ఇక్కడికి ఎందుకువచ్చావు?" విమల అడిగింది.
"కన్నం వేయాడానికి" "ఆ...కన్నమా? ఎంతసేపయింది వచ్చి? ఇంతకుముందు ఒకసారివచ్చేవా?"

"ఆ. వచ్చేను. మీ పర్సులో ఒక రూపాయి మాత్రం కన్నంవేశాను."
"మళ్లా ఎందుకు వచ్చేవు?"
"రాత్రి మీవద్ద కన్నంవేసింది రాత్రికే, మరల ఇప్పుడు కన్నంవేయడానికి వచ్చింది ప్రొద్దుటి భోజనంకోసం— తెలిసిందా?"
రామునుచూచి, రాము మాటలువిని, చదువుకున్నవాడులావున్నాడని గ్రహించి "మీతో మాట్లాడే విషయాలు వున్నాయి. ఇలా ఒకసారి వస్తారా?" అన్నది విమల. రాము మేడమీదకు ప్రవేశిం

చాడు. అప్పటి కప్పుడే 6 గంటలు అయింది. బా తెల్లవారి పోయింది. మీరు మొహం కడుక్కోండి అంది విమల. అన్నీ అయి పోయాయి అని రాము జవాబుఇచ్చాడు. అయితే నేను మొహం కడుక్కుని ఇప్పుడేవస్తాను వుండండే, వెళ్లిపోయేరు సుమా ? అని చెప్పి విమలక్రిందికి వెళ్లి నిత్య కృత్యాలు తీర్చుకుని పైకివచ్చేసరికి, బోయ్ వచ్చాడు. చాటుకు పిలిచి 2-0-0 కాగితం చేతికిఇచ్చి, టిఫిన్ కాఫీ తీసుకురమ్మని పంపింది విమల. ఇంతలో దాసీమనిషివచ్చి, పాచిపని చేసి పొయ్యిమీద నీళ్లు వేసింది. ఇదంతా రాము చూస్తూ కూర్చున్నాడు. ఇంతలో విమలవచ్చింది. "ఏమండీ మిమ్మల్ని రెండు విషయాలు అడుగుతాను, మీరు ఏమీ అనుకోనుగదా ?"

"అబ్బే ! అడగండి. అనుకోవటం దేనికి ?"

"మీది ఏవూరు ? మీరు ఏమిచేస్తూంటారు ? ఇక్కడికి ఎందుకు వచ్చారు ?"

"అదా ? నాది విజయవాడ దగ్గర ఒక పల్లెటూరు. నా తల్లి దండ్రులు ఈ మధ్యేపోయారు. నాకు ఎవ్వరూ లేరు. నేను బి. ఎ. ఫస్టు క్లాసులో ప్యాసు అయ్యాను. ఏదైనా వుద్యోగం దొరుకుతుందేమో నని ఇక్కడికివచ్చాను. నాకు కొద్దిగా ఆస్తివుండేది. నా తండ్రి తన చేతితోనే అమ్మివేశాడు. ఇంక ఇల్లు సామాను మిగిలితే అది నేను అమ్మివేసి, వుద్యోగంకొరకు తగలబెట్టి డబ్బు అయిపోయి, నానా అవస్థలుపడి గత్యంతరం లేక, మీ ఇంటిలోకన్నంవేసి, దొంగని అనిపించుకున్నాను. అదీ నా జీవితచరిత్ర" అన్నాడు రామునిర్భయంగా. ఇంతలోబోయ్ కాఫీ తీసుకువచ్చేడు.

కాఫీ తాగింతర్వాత "రాము ఒకవిషయం అడుగుతాను ఏమీ అనుకోరు గదా ?" అని విమలను అడిగేడు, "దానికేం అడగండి.. ఏమీ అనుకోను" అంది విమల.

"మీరు నా జీవిత చరిత్ర అంతా తెలుసుకున్నారు గదా. మరి..."

"ఓ. అదా? అర్థం అయింది. చెప్తున్నాను వినండి, నేనూ మీలాంటి దానినే. నా తల్లిదండ్రులు నా చిన్నతనాన్నేనన్ను, అనాథశరణాలయంకు ఒప్పచెప్పి చనిపోయారు. అప్పటినుంచి వాళ్లునన్ను పెంచి పెద్ద దానినిచేసి ఇంటర్ వరకు చదివించారు. ఉద్యోగంకు ప్రయత్నించగా ఇక్కడ ఒక ఫరంలో గుమస్తా ఉద్యోగం దొరికింది. నాకు నెలకు 100 రూపాయలు ఇస్తారు. ఇప్పటికప్పుడే 3 సంవత్సరాలనుండి, ఇక్కడ, ఈ మేడలో ఒంటరి జీవితం గడుపుతున్నాను" అంది నవ్వుతూ.

"ఊఁ, నాగతే పట్టిందిమీకు," అన్నాడు రాము నవ్వుతూ.

"పోనీలెండి దిక్కులేనివాళ్లకు దేవుడే దిక్కు అని దిక్కులేనివాళ్లని ఇద్దర్నీ ఒకేచోటికి జేర్చాడు. ఆ దేవుడికిమాత్రం తెలియదా?" అంది విమల కొంటెగా చూస్తూ-అప్పటికప్పుడే రాముకు అంతా అర్థమైపోయింది.

* * *

ప్రొద్దుటేలేచి నిత్యకృత్యములు తీర్చుకుని కాఫీ తాగి రిజిష్టర్ ఆఫీసుకు వెళ్లి మారేజి కొస్తా పూర్తి చేసుకుని, భోజనం వేళకు ఇంటికి చేరుకున్నారు. అప్పటికి విమల మనస్సుకు శాంతి కలిగింది. రాము మనస్సు శాంతించింది. యధావిధిగా కేరేజి తెప్పించుకుని ఇద్దరూ భోజనం చేశారు. బోయ్ చేత ఒక పేపరు తెప్పించి రాముకిచ్చి ఇది చూసుకుంటూవుండండి. నేను ఫరంకు వెళ్లి 4½ గంటలకు వస్తాను. అంటే ఒక అరగంట ముందువస్తానన్నమాట-ఇద్దరం బీచికి వెళ్దాం అని చెప్పి బోయ్‌ను పిలిచి మధ్యాహ్నం కాఫీహోటల్‌కు వెళ్ళి టిఫిన్ కాఫీ తీసుకునివచ్చి రాముగారికి ఇయ్యి. అని చాటుగా పిలిచిచెప్పి 2-0-0 ఇ కౌగిలం ఇచ్చి, రాముదగ్గర సెలవుపొంది,విమల ఫరంకు వెళ్లిపోయింది విమల వెళ్లిపోయినది మొదలు రాము మనస్సు విమలవెంటే వెళ్లిపో

యింది. ఏమీ తోచటంలేదు. పేపరుచదవడానికి ఇష్టంలేదు. విమల ఫరంకు చేరుకుంది. ఫరం మేనేజరు విమలనిపిలిచి, నెమ్మదిగా “విమలా, నీవు ఈ ప్రొద్దుట ఎవరితోనో మేరేజిచేసుకున్నావటగా?” అన్నాడు. “అవునండి, అతను మాబావే, ఆయన పేరు రాము. బి.ఏ. ప్యాస్ అయ్యారు. ఆయనికి ఎవ్వరూ లేరు. చిన్నతనంలో ఆయన తల్లి దండ్రులుపోయారు. నాకూ ఎవ్వరూ లేరుగా? ఇద్దరం ఒకే స్కూలులో చదువుకున్నాం. అక్కడే మాబావను నేను ప్రేమించాను. నన్ను మాబావ ప్రేమించాడు. ఇప్పటికి అతని బి. ఏ. పూర్తిఅయింది. ఇప్పుడు వచ్చాయి. అలస్యం అమృతం విషం అని మేరేజి చేసేసుకున్నాం.” అంది విమల. “మంచి పనిచేసావు విమలా” అన్నాడు మేనేజరు నవ్వుతూ. “అయితే ఏదైనా జాబ్ చూశేవా అన్నాడు.” “లేదండి, ప్రయత్నించాలి. మీరుకూడా నామీద దయవుంచి ఏదైనా జాబ్ చూపించండి” అంది విమల. అలాగే చూద్దామన్నాడు.

క్రమంగా నాలుగన్నరఅయింది. “విమల ఇంకా రాలేదే” అని రాము బయలుదేరుదామనుకునే సరికి, మేనేజరు వద్ద సెలవుపొంది విమలేవచ్చేసింది ఒక పావుగంటకల్లా. “ఏం విమలా, అలస్యంచేశావు ? ఇప్పుడు నేను ఫరంకు వద్దామనుకుంటున్నాను.” అన్నాడు రాము.

ఇద్దరూ బీచ్ కి బయలుదేరారు. అక్కడ ఫరం మేనేజరు కనిపించి “విమలా, డైరెక్టరు గారితో మాట్లాడేను. మీ ఆయనకు రేపటినించి ఉద్యోగం” అన్నాడు. అంతా వింతగా ఉందికదూ ఈ కథ!

రామసుబ్బారెడ్డి

# విషాదఘటన

ప్రకృతిమాత ఉన్నట్టుండి ఒక్కసారిగా నిశ్చలత్వం వహించింది. గాఢాంధకారంలో కన్నుపొడుచుకున్నా ఏం కనిపించడంలేదు. అయితే ఒకక్షణం క్రిందట జరిగిన విషాద సంఘటనని నిశాగర్భం తనలో ఎలా ఇముడ్చుకోగలదు?

బాలచంద్రుడు మేఘాల తెరలని ఒత్తిగించుకొని అంధకారంలోకి తొంగి చూశాడు. రజనీకరుణ్ణి చూడగానే రత్నాకరుడు ఉప్పొంగి పోయి నింగి ముట్టాడు. కలువరాణి తన ముకుళితనయనాలు అల్లన విప్పింది. ఆవిషాద దృశ్యం అందరి దృష్టుల్లో అలుముకుంది.

భూమాత సస్యశ్యామల సమృద్ధయి నిత్యనూతన శోభతో నిగనిగ లాడుతూ నేత్రానందకరంగా ఉంది. పాలేరు రామన్న సాగుచేసిన పొలంలో పంట బాగా ఎదిగి కోతకసిద్ధంగా ఉంది. అయితే రామన్న! అరగంట క్రితం జలప్రళయంగా కురిసిన వర్షం చూస్తూండగానే హఠాత్తుగా ఆగిపోయింది. చెట్లమీది పక్షులు రెపరెప కొట్టుకుంటూ రెక్కలు ఆరేసుకుంటున్నాయి. చెట్ల ఆకులమీంచి నీటిబిందువులు టపటప క్రిందపడుతున్నాయి. ఆ రాత్రి చీకటిలో పాకనుండి ఇంటికి బయలుదేరిన రామన్న పాలేరు ఏమయ్యాడు?

ఇంటికి వెడుతూన్న రామన్నకి హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది-పాకలో దూడల్ని కట్టలేదన్న సంగతి. గబగబా మళ్లీ పాకవేపు పరిగెత్తాడు రామన్నపాలేరు.

దివాకరుడు మెల్లిమెల్లిగా అస్తాద్రిని చేరుకుంటూ తన అరుణకిరణాలతో ఆకాశాన్ని అలంకరిస్తున్నాడు. ఉన్నట్టుండి నీలమేఘాలు నింగిని వ్యాపించాయి. క్రమక్రమంగా అంతటా గాఢాంధకారం అవరించుకుపోయింది. ధారాపాతంగా వర్షం కురిసే సూచనలు కనిపించసాగాయి. అయినా పాలేరు రామన్న పాకదగ్గిరికి చేరుకుని దూడల్ని కట్టేసి రావాలి. అతను మధ్యత్రోవలో ఉండగానే వర్షం ప్రారంభించింది. రామన్న పరుగెత్తుకుని వెళ్లి పాక చేరుకున్నాడు - వర్షంమాత్రం అంతకంతకి ఎక్కువైపోతోంది.

రామన్న పాలేరు దీపం వెలిగించి దూడల్ని కట్టేశాడు. వాటికి మేత వేశాడు. వర్షం ఎడతెగకుండా కురుస్తూనే ఉంది. బయట ఆకాశం లోకి తలెత్తి చూశాడు. వర్షం తగ్గే సూచనలు కనిపించడంలేదు. పెద్ద చుట్ట ఒకటితీసి వెలిగించుకుని గోడకి జేర్లబడి ఆలోచిస్తున్నాడు రామన్న.

పంటలన్నీ నాశనమయ్యేందుకే ఈ వర్షం. క్రిందటి సంవత్సరం వర్షాలులేక పైరులన్నీ మలమలమాడిపోయాయి. తిండికే కరువొచ్చింది. కాలు దారుకి చెల్లించవలసిన పదిబస్తాల మగతా అలాగే ఉండిపోయింది. పోయిన ఏడు పోనీ అల్లా అయింది—ఈ ఏడేనా వరుణదేవుడు కరుణిం చడూ ? ఎంతో ఆశతో పొలంలో పైరులు పెట్టాడు. తీరాపంటలు కోతకొచ్చాక ఈ అతివృష్టేమిటి ? గోరుచుట్టుమీద రోకటిపోటు కాకపోతే యేమిటిది ? ఇంటి దగ్గర స్థితిగతులెల్లా ఉన్నాయో ? వర్షంవెలిసీ వెలవడంతో గబగబా కర్రచేతబట్టుకుని రామన్న ఆ కటికి చీకటిలో ఇంటిత్రోవపట్టాడు.

ప్రకృతిమాత నిశ్చలంగా ఉంది. మందమారుతాలు చల్లచల్లగా వీస్తు న్నాయి. రామన్నపాలేరు పొలంగట్టుమీంచి నడుస్తున్నాడు. దారి ఎత్తుగాఉండడంచేత నీరు కాలికి తగలడంలేదు. అతని చుట్టూఉన్న ప్రదేశమంతా జలమయం.

గాఢాంధకారం. కన్నుపొడుచుకున్నా యేమీకనిపించడం లేదు. దారి ఎగుడు దిగుడుగాఉంది. రామన్నపాలేరు తొందర తొందరగా అడుగులు వేస్తున్నాడు. కాళ్లు తడబడుతున్నాయి.

అకస్మాత్తుగా రామన్న పాలేరు 'ఆ' అంటూ నేలమీదపడిపోయాడు. అప్పుడే మేఘాలతెర వొత్తిగించుకుని బాలచంద్రుడు ఆకాశాన్ని వెలిగించాడు. ఆ మసకవెన్నెలలో, రామన్న కాలిమీద కాటువేసిన నల్లత్రాచు జరజరా ప్రాకి మాయమైపోయింది.

బాలశౌరి రెడ్డి

# దాగని సత్యం

నాగులాపురమొక ఆదర్శ గ్రామమని చెప్పాలి. భాస్కరరావు ఆవూరికి క్రొత్తగావచ్చాడు. ఆవూరి పాఠశాల భాస్కరరావు వచ్చాక ఎంతో అభివృద్ధిచెందింది. అతడు గ్రామపెద్దల ఆదరాభిమానాలకు కూడా అనతి కాలంలోనే పాత్రుడయ్యాడు. అవివాహితుడైకూడా స్కూలు పిల్లలను బిడ్డలలాగా దగ్గరకితీసేవాడు. ఆస్కూలు కుటుంబంలాగా మారిపోయింది. అక్కడ గురు, శిష్యుల సంబంధం కానరాదు. తల్లి దండ్రులు బిడ్డలు లాగా కన్పిస్తారు.

కొంత కాలానికి ఆ స్కూలుకు ఇంకో లేడీ టీచరువచ్చింది. ఆమె పేరు కమల. ఆమె ఎఱ్ఱగా, పొట్టిగాఉంటుంది. రాను, రాను వారిద్దరిమధ్య ప్రేమాంకురాలు మొలకెత్తాయి. అవి చివరకు వృక్షంలాపరిణమించాయి. గ్రామస్థులకు కూడా వీరిద్దరికి వివాహం చేయాలనే సంకల్పంకల్గింది. వీరికి పూర్వము గ్రామంలో ప్రవేశించియుండిన టీచర్లంతా గ్రామంలో తగాదాలు పెంచడం, పిల్లలను బాగ కొట్టడం తప్పితే చదువు చెప్పిందిసున్న. ఈ లాంటి వ్యవహారాలతో విసుగుచెందిన గ్రామస్థులకు గ్రామాన్ని అన్ని రీతుల సంస్కరించదగ్గ ఉపాధ్యాయుల అవసరమెంతోఉంది. వీరిద్దరి ద్వారా తమ ఆశయము నెరవేరినందుకు గ్రామవాసులు వారి నెంతో అభినందించారు. వీరిద్దరు వచ్చాక టైంప్రకారం పాఠాలు చెప్పడం, వ్యాయామం, పర్యటన, ఆటలు, పాటలు. తోటపనులతోపాటు పిల్లలలో లోకజ్ఞానాన్ని కలుగచేసి వారి నడివడికలను సరిదిద్దారు. ఇప్పుడు పిల్లలు స్కూలునుంచి ఇంటికివస్తే తల్లిదండ్రుల్ని ఏడ్పించుక తినేవారుకాదు. ఏదోకావాలని, డబ్బుకావాలని అలగడం, ఇతర పిల్లలతో కొట్లాడడం అంతరించాయి. అంతేకాక గ్రామస్థుల మధ్యకూడా అనవసరంగా అజ్ఞానంతో పెరుగుతున్న కజ్జాలను రూపు

మాపి గ్రామంలో సహకారోద్యమాలను స్థాపించారు. ఆ గ్రామం సిరిసంపదలతో కళకళలాడేది.

ఉపాధ్యాయులు గ్రామాభ్యుదయము, గ్రామసౌకర్యములలో ఇటువంటి పాత్ర ఎప్పుడూ వహించలేదు. వీరిద్దరు దంపతులైపోతే తమ గ్రామమింకా ఎంతో అభివృద్ధిచెందుతుందని అంతా ఆశించారు. పరోక్షంగా వీరి వివాహానికి ఎంతో ప్రయత్నంచేశారు. కాని అన్నింటికి సమయమంటూ రావాలిగా! అసలు వీరిద్దరికీకూడా ఆ అభిప్రాయములేక పోలేదు. అట్లాగని తొందరపడడము కూడా మంచిదికాదేమో!

*

అవివేసవిదినాలు. పాఠశాలకు సెలవులు కాబట్టి టీచర్లు వారివారి ఇండ్లకెళ్ళిపోయారు. కమల కుటుంబము చాలా సంపన్నమైనది. చదువు సంస్కారంగల కుటుంబం. ఆమె అన్నలు ఎంతో పెద్ద ఉద్యోగాల్లో ఉన్నారు. తండ్రి దూరదృష్టిలేకుండా ఏవో వ్యాపారాలు చేసి బంగారం లాంటి ఆస్తితగలేశాడు. కాబట్టే ఆమెకు పంతులమ్మ పని చేయాల్సివచ్చింది. ఆమె కుటుంబం ఎంతో ఆదర్శమైనదని చెప్పాలి. ఆ మధ్య ఆమె బంధువు ఒకడు బి.ఎ. చదువుతూ — సెలవుల్లో ఇంటి కొచ్చి ఇద్దరూకలసి పొలాల వైపు షికారువెళ్లారు. పల్లెలకు షికార్లు వుండవుగా మరి! పల్లెలలో చదువుకున్న యువకులు స్వేచ్ఛగా పొలాలకెళ్ళడం అందరి కళ్లను గుచ్చుకుంటుంది. అదే ఆశిక్షితులు వెళ్లచ్చు. అందులో ఏమీ చిత్రము కాన్పించదు. చదువుకున్న వారంటే వారి అభిప్రాయంలో దేవుండ్లలాగా మెలగాలని. మానవ మాత్రుల తప్పుల్ని, చదువుకున్నవారిలో అక్షమ్య అపరాధాలుగా గ్రామస్థులు భావిస్తారు. అందుకనే, కమల తనస్నేహితులతో సరదాగా పొలాలవైపుకెళ్లితే వారికండ్లు చూడలేకపోయాయి. అంతే కాదు ఆమెను ఆదినుంచి కులటక్రింద లెక్కగట్టారు. ఎక్కడచూచినా ఈ వార్త వయర్‌లెస్‌లాగా వ్యాపించిపోయింది.

మరొకవింత. కమలకు యుక్తవయస్సువచ్చినప్పటికి సరియైన సంబంధం కుదరక వివాహము వెనక్కుపోయింది. ఆమె కోరికపైననే ఆమె తండ్రి నిదానించాడు. అదే గ్రామంలో ఇంకొక యువకుడు ఆమెను ప్రేమించాడు. కమల అతని ఆరాధ్యదేవి. హృదయంలో పెట్టుకొని ఆమెను పూజించుకుంటున్నాడు. వాళ్లు ఒక గ్రామస్థులే కాదు. సహపాఠకులు కూడా. ఒకరినొకరు బాగా అర్థంచేసుకున్నారు. అయితే, కమల మాత్రం అతనిని ఒకస్నేహితునిలా చూచేది. కృష్ణమోహన్ కూడా కమలను అదే అభిప్రాయంతో చూచేవాడు. అయితే యౌవనం, ఆమెను, జీవిత సహచరిగా ఎన్నుకోమని ఉద్బోధించింది. అప్పటినుంచి ఆమె అతని హృదయంలో స్థానమాక్రమించుకుంది.

*

కమల నడవడినిగూర్చి ప్రచారకుల పుకారు కృష్ణమోహన్ చెవిలోకూడా పడకపోలేదు. అయితే ఆమె స్వభావాన్ని బాగా అర్థంచేసుకున్నవాడు కాబట్టి అతడేమీ చలించలేదు. పోతే కృష్ణమోహన్ ఎలాగైనా కమలను ఒప్పించి పెండ్లిచేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఆమె లేనిది తన జీవితం వ్యర్థమనుకున్నాడు. అయితే తన యీ దృఢ నిశ్చయం ఎలాగా నెరవేరడం ?

* *

ఒకనాటి రాత్రి భాస్కరానికి నిద్రపట్టలేదు. అర్థరాత్రి వరకూ అతడు ఏవో ఆలోచించుకుంటున్నాడు. తన ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోయింది. మంచాన్ని ఆరు బయట వేసుకుని పడుకున్నాడు. చల్ల గాలికి బాగా నిద్రపట్టింది. తెల్లవారు ఝామున అతన్నెవరో మేల్కొలిపినట్లయితే బలవంతాన కళ్లు తెరచి చూచాడుగదా, కృష్ణమోహన్ నిలువబడిఉన్నాడు. ఏదో కొంపమునిగినట్లు ఆదుర్దాగా ఉన్నాడు. కమల కన్యత్వం చెడిందని ఏమేమో చెప్పాడు. భాస్కరం హృదయంలో రాయివేసినట్లయింది. ఆమెతో అతని పెండ్లికూడా నిశ్చయ

మయింది. అయితే తేదిమాత్రం ఇంకా నిశ్చయించుకోలేదు. కృష్ణమోహన్ ఎత్తుగడ ఎరుగని భాస్కరం అతనిమాటలను పూర్తిగా నిజమని నమ్మాడు. అతడు చలాకీగా కమలతో పెళ్లిచేసుకోనని ప్రతిజ్ఞ చేయించాడు భాస్కరంతో. కమల గుణం తెలిసిఉండి కూడా పయోముఖ విషకుంభమని, మరేమో దూషించాడు భాస్కరం. అతని హృదయం ఎంతగా బాధపడిందో ఇతరులకేమి అర్థంఅవుతుంది!

కృష్ణమోహన్ ఎత్తుగడ పారినందుకు సంతోషించాడు. ఇక కమలను తన దానిగా చేసుకోవాలని ఎంతో ప్రయత్నించాడు. అయితే కమల ఒకరినే ప్రేమించింది. ఇంకెవరినీ కన్నెత్తైనా చూడదు. భాస్కరం మాత్రం కమల ముఖం ఇక చూడకూడదనుకున్నాడు. ఈ సంగతి తెలియని కమల యథాప్రకారం రెండవరోజు అతనివద్దకు వచ్చింది. కమల భాస్కరాన్ని చూచినపుడు ఏదో కొంపమునిగిందనుకుంది. భాస్కరం ఆమెను పలుకరించాడు కాదు. కూర్చోమని కూడా చెప్పాడుకాదు. ఆమె రాకకు నేటివరకు ఎంతో ఆప్యాయంగా ఎదురుజూచే భాస్కరం ఎదుట నిలువబడినపుడుకూడా పలకరించకపోయాడంటే కమల హృదయమేలాగా బాధపడిఉంటుంది. అంతేగాదు. భాస్కరం అన్నమాటలు ఆమె హృదయాన్ని ముక్కలు ముక్కలుగాచేశాయి. ఇన్నిరోజులవరకు పెంచి కాపాడిన ప్రేమలత పెనుతుపానుకు విరిగిపోతుంటే చూస్తూ ఆమె ఎలా సహించగలదు? భాస్కరం ఇక తన ముఖము చూడవద్దని, కులటని ఆమెనవమాన పరచాడు.

కాని చివరికి కమల నిర్మలత్వం తెలుసుకున్నప్పుడు భాస్కరం ఎంతో బాధపడ్డాడు. కృష్ణమోహనుని చంపేద్దామన్నంత కోపంవచ్చింది. అయితే అందువల్లకల్గిన ప్రయోజనమేమిటి? తన కమల తనకు తిరిగి లభిస్తుందా?

"సత్య"

# ఎప్పుడూ ఇంతే!

ఆ వేళ సాయంత్రం అల్లా పార్కు దాకా వెళ్లివద్దామని బుద్ధిపుట్టింది. పిల్లల్ని తీసుకుని బయలుదేరాను. ఆయన ఆఫీసుపని అయిదున్నరకి అయిపోతుంది. త్రోవలో ఆయన్నికూడా తీసుకుని వెడదామని అసలు ఉద్దేశ్యం.

పవర్ హౌస్ బస్ స్టాప్ దగ్గరకి వచ్చేటప్పటికి ఆయన ఆఫీసునుంచి వస్తూ కనిపించారు. నేను ఆయన్ని చూశా నేతప్ప ఆయన దృష్టులు మాత్రం ఈ బహిఃప్రపంచాన్ని చూస్తూన్నట్లు లేవు. నేను అల్లాగే ఆయనకేసి చూస్తూ మెల్లిగా నడుస్తున్నాను. పిల్లలు బజారుదృశ్యాల్నీ వచ్చేపోయే కార్లనీ చూస్తూ నా వెంట వస్తున్నారు.

ఆయన మాముంగు నడుస్తున్నారు. రాజకుమారి టాకీస్ మీదుగా పాండిబజారువైపు నడుస్తున్నారు. అటూ ఇటూ చూడకుండా ముక్కుకి సూటిగా ముందుకి వెళుతున్నారు. తిన్నగా పానగల్ పార్కు దాకా వెళ్ళిపోయారు. నేనూ పిల్లలతో బాటు ఆయనవెనకాలే పార్కులో ప్రవేశించాను.

ఒక అరగంటలో ఆయనకి అక్కడి వాతావరణమంతా నిషాక్తమై పోయినట్లు తోచింది. అవును, నాకు తెలుసు, ఆయన చాలా సెంటిమెంటల్ గా ఉంటారు. అయిదారు రోజులనుండి చూస్తున్నాను. హృదయంలో ఏదో బాధపడుతున్నారు. ఇప్పుడు పార్కులోని ఈ ఆనందమయ వాతావరణాన్ని చూసి ఆయన హృదయావేదన ఇంకా ఎక్కువైపోయినట్లు కనిపించిది.

ఆయన ఇంక ఒక్కక్షణం అక్కడ కూర్చుండలేకపోయారు. లేచి మళ్ళీ పాండీ బజారువేపు బయలుదేరారు. నేను అనుకోకుండానే ఆయన వెనకాలే బయిలుదేరాను. పిల్లలుకూడ ఆటలు కట్టిపెట్టి నా వెంట బడ్డారు.

రేపు దీపావళి! 'తెల్లారితే దీపావళి' అన్న ధ్రువసత్యం ఆయన వద్దను కున్నా హృదయంలో ప్రతిధ్వనిస్తోంది. ఈ కార్లలో ఎక్కి తిరిగే వాళ్ళకీ, ఈ బస్సులమీద వచ్చే పోయేవాళ్ళకీ, ఈ బజారులో విహ రించే ఈ అసంఖ్యాక దంపతులకీ అందరికీ దీపావళే! రేపేవస్తుంది. ఆయనకి బాధగా ఉంది. తనకి దీపావళి...ఇంక ఆయన బుర్ర ఆలో చించలేదు. గబగబా అడుగువేస్తూ నడుస్తున్నారు. రాజకుమారి టాకీస్ దాకా వచ్చేశారు. అంతే - ఇంకముందుకి అడుగుపడలేదు.

రాజకుమారి ఎదుటి సందు దాటి కొంచెందూరం వెడితే మా ఇంటి సందు వస్తుంది. ఇంట్లో, భార్య పిల్లలు ఆయనకోసం ఎదురుచూస్తూఉంటారు. అయితే ఇంటికి వెళ్ళి వాళ్ళని చూడడానికి ఆయనకి మనస్సు ఒప్పడం లేదు. ఎప్పుడూ ఇంతే! వట్టిచేతులతో ఉత్తిప్పుడే ఇంటికిరారు! తెల్లారితే దీపావళి మరి!

గిర్రున వెనక్కి తిరిగారు. మళ్ళీ వచ్చినత్రోవనే బయలుదేరారు. ఈ సారి నిజంగా కళ్ళు మూసుకునే నడుస్తున్నారు. లేకపోతే ఈపాటికేనా నన్ను, పిల్లల్ని చూసేవారు. అసలు ఆయనదృష్టి ఈలోకంలో లేండే. తిన్నగా పార్కుదాకా వచ్చేశారు.

నిన్న మొన్నటిలా కనిపిస్తుంది ఆయనకి. తను కాలేజి చదువుమాని ఉద్యోగంలో ప్రవేశించారు. చూస్తుండగానే ఎనిమిదేళ్లు ఐంది. ఐతే ఈ ఎనిమిదేళ్లలోనూ ఎన్నోమార్పులు కలిగాయి ఆయన జీవితంలో. ఎంతో అనుభవం కలిగింది. తాను ఉద్యోగంలో ప్రవేశించడం, భార్య కాపరానికి రావడం, ముగ్గురుపిల్లలు పుట్టుకురావడం, ఖర్చులు పెరిగి పోవడం, జీతంలోమాత్రం చెప్పుకోతగ్గ అభివృద్ధిలేక పోవడం, జీవితం లో అనేకకష్టాల్ని అనుభవించాల్సి రావడం, అన్నీ తల్చుకుని బాధ పడడం ఆయనకి మామూలే.

తెల్లారితే దీపావళి! తనకి లేకపోయినా భార్యకి లేకపోయినా సరదా పడే పిల్లలకైనా పండక్కి క్రొత్తబట్టలు కొనిపెట్టగల స్థితిలో లేనే అన్నవిచారం! అది ఆయన కల్పించుకున్నదే. ఇటువంటి లేనిపోని సమస్యల్ని కల్పించుకుని విచారిస్తూ కూర్చోడం మామూలే.

నిజంగాచూస్తే ఎవరినిగాద ఆయన కంప్లెయింటు? తనమేనేజర్ని అంటారా-సెక్రటరీని విమర్శిస్తారా లేక గవర్నమెంటునే తిడతారా? ఆయనబుర్ర వేడెక్కి పోయింది. మళ్ళీవెళ్ళి పానగల్ పార్కులో ఒక చెట్టుక్రింద కూర్చున్నారు. నేనూ పిల్లలూ దూరంగా బంచీమీద కూర్చున్నాం. రేడియో ఆగిపోయింది - లైట్లుకూడా ఒక్కొక్కటే ఆరిపేస్తున్నారు. మైన్ గేటుతప్ప మిగతా గేట్లుకూడ మూసేశారు. ఎనిమిది గంటలైంది. నేను ఆయనవేపే చూస్తున్నాను. కళ్ళు మూసుకొని నిశ్చలసమాధిలో అల్లాగే కూర్చునిఉన్నారు.

ఇంక లాభంలేదనుకుని పిల్లలూ నేనూలేచి ఆయన కూర్చున్న వేపు బయలుదేరాము. తనవేపే ఎవరోవస్తూన్న అలికిడివిని ఆయన కళ్లుతెరిచి చూశారు. ఎదురుగా నేనూ పిల్లలూ ప్రత్యక్షం!

"ఏమిటిది? ఇంతరాత్రిదాకా ఏంజేస్తున్నారు, బాగానేఉంది. తెల్లారితే పండగకదా. పెందరాళే ఇంటికి జేరుకుందామని తోచదేం మీకు? పెద్ద బెంగపెట్టుకుని మతి పోగొట్టుకోడం ఎందుకు? ఉన్నదాంతోటే జరుపుకుంటాం. నలుగురం ఇంట్లో సరదాగా జేరుకోడంకంటె మనకి కావలసిందేమిటి. ఎప్పుడూఇంతే. పదండి ఇంటికి - ఎవరేనాచూస్తే నవ్విపోయేరు!"

నామాటలు వినీవినడంతో హృదయం ఒక్కసారిగా తేలికపడి ఏదో పరమసత్యాన్ని గ్రహించినవారిలా ఆయనలేచి నుంచున్నారు.

శ్రీ రామారావు

# పాండురంగని ప్రగల్భాలు

నేను యస్. యస్. యల్. సి చదువుతుండగా పాండురంగని దుష్ట గ్రహము ఒకనిమిషం కాదు, ఒకగంట కాదు, రోజుకు ఐదుగంటలు నన్ను వెంటాడింది. చదువుమీద శ్రద్ధతగ్గించి పాఠాలను మర్చిపోవ డానికి అవకాశం కలిగించింది.

"వినిన భారతము వినవలె, తినినగారెలు తినవలె"—ఆ గారెలుకూడా అతిగా తింటే మొహం మొత్తుతాయి. అలాగే పాండురంగని పల్కులు క్రమంగా పాతబడి నాకు ఏవగింపు కలిగించసాగాయి. కాని నావద్దకు రావద్దు అని అతనితో అంటే బాగుంటుందా! అది మర్యాదకాదు. అత నికే తెలియాలికాని నేనుచెప్పడం ఏం మంచిది?

"శ్రీగల భాగ్యశాలికడ జేరగ వత్తురు తారుదార దూరాగమన ప్రయాసమున కాదట నోర్చియునైన నిల్వ నుద్యోగము జేసి—." సం పద అంటే ఎంతో లేకపోయినా కాఫీ, టీలు ఇప్పించగలడబ్బు నాదగ్గర ఉంటుంది. అందుకనేగదా సాక్షాత్తు పాండురంగడు నన్నాశ్రయించినది!

సాయంకాలం నాలుగున్నర గంటలుకావడం ఆలస్యం అతడువచ్చి మాయింట్లో కూర్చుంటాడు. కాఫీ తాగాలని బుద్ధిపుట్టి నాలుగుడబ్బులు జేబులో వేసుకుని గడపలోకిరాగానే అతడు ప్రత్యక్షం. లావుపాటి ఉదరంతో లేచి నన్ను వెంటాడుతాడు. మధ్యలో కాఫీ తాగడానికా! అని నాకు గుర్తుచేస్తాడు. వచ్చి కాఫీహోటల్లో నిశ్శబ్దం ఆభరణంగా ధరించి నా ప్రక్కనే ఆసీనుడౌతాడు.

"ఓహో, సినిమాకా" అని ఆదివారం నావెంట బయలుదేరడం, హాలులో టిక్కట్లిచ్చేచోట తచ్చాడటం, దగ్గర్లో బోర్డుల్లో అంటించి ఉన్న బొమ్మలను తిలకించడం అతనికి అలవాటు. అదీ నేనిద్దరికీ టిక్కట్లు కొనేప్పుడు మాత్రమే!

ఒకసారి శ్రీరామమూర్తి అనే మిత్రుడు మేం వెళ్లిన సినిమాకి అర్ధరూపాయి టిక్కట్టు కొనివచ్చాడు. మేం రూపాయివి కొన్నాం. మేం అంటే నేనన్నమాట! సరే, ఇంటర్వల్ లో బయట మావాడు శ్రీరామమూర్తిని మందలిస్తున్నాడు. "అర్ధరూపాయి టిక్కట్టుకు వెళ్ళడమేమిటి! గౌరవ హీనం అని." నాకు మహాకోపం వచ్చింది. "పరాయివాళ్ళ డబ్బుల్తో రూపాయి టిక్కట్టుకు వెళ్ళడంకంటే అర్ధరూపాయికి వెళ్ళడం గౌరవం" అందామనుకున్నా కాని అనలేదు.

అతనికి నూజివీడులో ఐదెకరాలు, ఈవూళ్ళో ఒక ఇల్లు ఉన్నాయి. అంత మాత్రాన అతడు భాగ్యవంతుడెలా ఔతాడు? ఐనా తనకున్న నూట్లు కోట్లు లాంటివి ఈ ఊళ్ళోనే కాదు, భారతదేశంలో ఎవరికీ లేవంటాడు. ఎలా నమ్మాలి! నమ్మకపోయినా అతనలా చెప్పుకుపోతూనే ఉంటాడు. ఎదటివాళ్లు ఏమనుకుంటారో అనే జ్ఞానం అతనికుండదు.

సింహాళంనించి ఒక అమెరికన్ కంపెనీవారు ఒకసారి అతడికి అతగాడి కోర్కమీద కొన్ని ప్రశ్నలు పంపారు బైబిలుమీద. వాటికతడు జవాబులు రాసిపంపాడు. వాటికి సంతోషించి వాళ్లు "Very good' అని 'కితాబు' ఇచ్చారు. అది నిజమే కాని అందుచేత తను గాని అమెరికా వెళ్తే ఆ కంపెనీవాళ్లు తనకు విమానాశ్రయంలో స్వాగతమిస్తారనీ బసకు ఏర్పాట్లు చేస్తారనీ అంటాడు. తనను ప్రపంచంలోకల్లా మేధావంతుడుగా చూస్తారట! హాశ్చర్యం... హతోస్మి.

ముందు తను ఈ ఊరినించి నూజివీడు సైకిలుమీద వెళ్ళేవాడట. మధ్య పెద్ద అడవి ఉండేదట. అందులో పెద్ద పులులు వగైరా ఉండేవట. ఆ అడవిలో పగలే ఎవరూ ప్రయాణం చేసేవాళ్లు కాదట. కాని తను మాత్రం రాత్రిపూటకూడ సైకిలుమీద ఆ అడవిలో ప్రయాణం చేసేవాడట. ఇక పెద్దపులులంటారా! అవి మనవాడిని చూసి పారిపోయేవట! మనుషులకే కాక జంతువులకు కూడా తెలిసిఉండాలి పాండురంగమూర్తి ప్రతిభ, కాదు కాదు, పాండురంగని ప్రగల్భాలు.

# ఆ నాడు

ఆనాడు ఫాన్ క్రింద కుర్చీలో కూర్చుని వచ్చిన కథల్ని తిరగవేస్తున్నాను. అకస్మాత్తుగా నా దృష్టి ఒక కథమీదపడింది. అది పల్చటికాగితం మీద రెండువైపులా రాసిఉంది. చూస్తే ఒకే ఒక కాగితం అది. పావుటావుసైజు. దీనిలోనే కథ ఎలా ఇమిడిందా అని ఆశ్చర్యపోయాను. వెంటనే చదవడం సాగించాను. ముందుగా ఒక ఉత్తరంఉంది. చూస్తే అదినాకే రచయిత రాసిన ఉత్తరం. ఈ రెండు పేజీలలోను ఒక పేజీలో సగం ఉత్తరానికే సరిపోయింది. మిగిలిన పేజీన్నరలో కథను ఇమిడ్చాడు! నేను చదివాను.

"సంపాదక మహాశయా,

నమస్కారములు. మీకు ఎన్నో ఏళ్ళనించి కథపంపుదామని ఉవ్విళ్ళూరుతూ ఉన్నాను కాని ఇప్పటికిగాని వీలుకలుగలేదు. నేను చాలా శ్రమతో వ్రాసిన ఈ కథను మీ అనన్యప్రచార పత్రికలో ప్రకటించమని మిమ్మల్ని మిక్కిలి కోరుతున్నాను. త్వరలోనే మీ పత్రికలో నా కథను చూసుకుని మురిసిపోగలనని ఆశిస్తున్నాను. ఇంతకంటే నేను మీకు వ్రాయవలసిందేమీలేదు. అభివందనాలతో ముగిస్తున్నాను.

చిత్తగించవలెను. మీ శ్రేయోభిలాషి"

సంతకం ఇంగ్లీషులోఉంది. సరిగా తెలియలేదు. ఉత్తరంబాగానే ఉంది. నా శ్రేయోభిలాషి వ్రాసిన కథను నేనెందుకు ప్రకటించకూడదు, అనుకుని కథ చదవడం సాగించాను.

"అది మధురాపురి. విజయకేతుడు దానిరాజు. సిరిసంపదలకు లోటు లేదు. కాని సంతానయోగ్యత లేదు. జపతపవ్రతాదులు చేసినా ఫలం కలుగలేదు. - అది అతనికి విచారకారణమైంది.

ఒకరోజు ఒక మునీశ్వరుడు రాజాస్థానానికి వచ్చాడు. రాజదంపతులు ఎదురేగి సత్కరించారు. వెళ్లిపోతూ మునీశ్వరుడు 'ఏం కావాలో

కోరుకొమ్మ'ని రాజు నడిగాడు. రాజు సంతానాన్ని కోరాడు. ముని ఒక ఫలాన్నిచ్చి దంపతులనారగించమని చెప్పి వెళ్ళిపోయాడు.

రాణి గర్భంతాల్చింది. నవమాసాలకు తేజోవిరాజితుడైన మగశిశువును కన్నది. పిల్లవాడు అల్లారుముద్దుగా పెరిగాడు. పెద్దవాడయ్యాడు. సకలవిద్యలూ నేర్చాడు.

ఒకనాడు తండ్రిని సమీపించి 'వేటకు వెళ్ళాలనిఉంది' అన్నాడు. రాజు సపరివారంగా మంత్రి తనయుని తోడిచ్చి కుమారుని వేటకు పంపాడు. అరణ్యమధ్యంలో ఒక సింహం కనిపించింది. రాజకుమారుడు గుర్రాన్ని అదలించి దాని వెంట పడ్డాడు.

పరివారాన్ని, మంత్రి తనయుని విడచి కుమారుడు సింహాన్ని తరుముకొంటూ నాలుగు క్రోసులదూరం వెళ్లాడు ఒంటరిగా. అక్కడ సింహం ఆగింది. రాకుమారుడు బాణం వదిలాడు. సింహం మాయమైంది. కాని ఈ మాటలు వినిపించాయి—

'ఇచటికి తూర్పుగా ఓ అరమైలుదూరంలో ఒక వట వృక్షం ఉంది. ఆ వృక్షం క్రింద ఒక గుహలో సకలకోరికలు తీర్చగల మణి ఉంది. సంపాదించు.'

రాజకుమారుడు వెళ్ళాడు. గుహలోప్రవేశించాడు. ఎన్నో క్రూర మృగాలు ఎదుర్కొన్నాయి. అన్నిటినీ నిర్జించాడు. ముందుకు సాగి మందిరంలో ప్రవేశించాడు. వెనుకనించి ఎవరోపిలిచినట్టయింది. వెనక్కి తిరిగి చూశాడు. అంతే! శిలగా మారిపోయాడు."

ఇంతే ఉంది కథ. ఇందులో పేరాగ్రాఫులు లేవు. చాలాకొట్టివేతలు, హంసపాదులు ఉన్నాయి. పైగా చిట్టచివర ఒకనోట్ ఉంది.

"ఈ కథను ఎలాముగించాలో నాకు తెలియడంలేదు. మీరే దానిని పూర్తిచేసి ప్రచురించండి,—మీ శ్రేయోభిలాషి."

నా శ్రేయోభిలాషి కథను ఎలా ప్రచురించాలా అని ఆలోచించాను. ఆనాటినించి ఆ కథనిగురించి ఆలోచిస్తూనే ఉన్నాను.

' కర్రా ప్రభాకర్ ''

# మూడు ముళ్లు

"ఆ మూడుముళ్ళూ పడ్డాయంటే ఇకమా బ్రతుకు బైటపడ్డట్టే'' అని తన వివాహం సమయంలో అమ్మ అన్నమాటలు – ఈనాడు వైధవ్యం కారణంగా రావమ్మ ఆ మూడుముళ్ల మంగళసూత్రం తీసిపారేస్తుంటే, ఆమె గుండెని మూడు ముక్కలు చేస్తూ మారుమ్రోగాయి. తనగృహం వైపుకో సారి కలయచూసింది. తన మూడంతస్థుల మేడ; ఆ మూడంతస్థుల మేడకి ముమ్మూర్తులా మిగిలిన తాముముగ్గురూ – తనూ తనకూతురు రాధ, తనకొడుకు రంగం. తను మూడు దశలపాటు ఆమూడంతస్తుల మేడలో తన మూడుముళ్ళ మంగళసూత్రపు హక్కును జమాయించింది. మూడు లోకాల నేలే ధీమాను చూపించింది తన ఇరుగుపొరుగు వారికి. మూడు మూర్తులా మహంకాళిలాగే ప్రవర్తించింది తన బంధువులతోటి దాసీజనంతోటీను. అదంతా ఇప్పుడు "మూన్నాళ్లముచ్చట'' అయిపోయింది!

ఇప్పుడా మూడంతస్తుల మేడలో మంగళ చిహ్నాలులేవు. మూడు శతాబ్దాల పురాతన మందిరంలా పాగ కంపుకొడుతూంది. అందులో ఆ మూడుజీవాలు బ్రతుక్కుంటూ వస్తున్నాయి. ఆపత్సమయంలో బంధువులు ఎవరూ దరికి రావడంలేదు. అయితే అయనధర్మమా అని బోలెడంత సంపాదించి పారేశాడు కాబట్టి మూడుపూటలా తిండికీ గుడ్డకీ తరుగులేకుండా కాలక్షేపం చేస్తున్నారు. "ముగ్గుర్ని కూర్చాడురా ముండా దేవుడు'' అని వాళ్లకిట్టనివాళ్లు ఆదారమ్మట పోతూ అప్పుడప్పుడు అంటుంటే రావమ్మ చెవుల పడకుండా పోలేదు. ఆమాటలు ఆమెకు భరింపరానివయిపోయాయి. ఆదశ ఇక మూడునాళ్ళు కూడా సాగకూడదని నిర్ణయించుకుంది.

తనఇంటికి మరోజీవం ఒకటి వచ్చివుంటే ఇంటికి ఒకకొత్తదనం, జీవం ముచ్చట ఉంటుందని ఆశించింది. తనఇంటిలో మరొకజీవం అవత

రించడం, స్వయంగా తనకు భగవంతుడు సాక్షాత్కరించడంకంటే ఎక్కువ మహత్తరంగా భావించుకుంటుంది. అయితే భగవద్దర్శనం అవడానికి సాధనాలు మార్గాలు వున్నాయి కాని తనయింటిలో మరో జీవం అవతరించడానికి మార్గం ఏముంది?—పరిపరి విధాల ఆలోచనలు సాగించింది. తన బంధువులకి ఆమెకు కలిగిన ఆపత్తులతో తృప్తి కలుగలేదు; ఆమెగర్వం అణిగితేకాని వారికి ఆక్కసుతీరదు. ఆమెగర్వం అణిగిందన డానికి వారికి నిదర్శనాలు ఏమీ కనిపించలేదు. కనీసం చూడవలసిన అవసరం వారికి కలుగలేదు. చూడాలనే శ్రద్ధ వారికి పుట్టలేదు కూడాను. వారికి అవసరం కలగడంగాని, వారిలో శ్రద్ధపుట్టడంగాని త్వరలో జరగాలంటే దానికి రావమ్మ ఉపక్రమించాలి. తన బంధువులతో ఏదోవిధంగా రాజీపడి, వారితో దగ్గరసంబంధం పెంపొందించుకుంటే కాని తనకోర్కె నెరవేరే మరో వుపాయం ఆమెకు తట్టలేదు. "అటు నుంచి నరుక్కురా" అని తన్ను తను ప్రోత్సాహ పరచుకుని కొంగు బిగించింది రావమ్మ.

మరునాడు తనయింటి పురోహితుణ్ని పిలిపించింది. ఆపైవారంలో వచ్చే తనభర్త శ్రాద్ధం కొత్తతరహాలో జరిపించడానికి ఏర్పాట్లు చేయించింది. శ్రాద్ధం అనంతరం సంతర్పణ ఏర్పాటు చేయించింది. తన బంధువులనందరినీ పిలిపించింది కొడుకుచేతా కూతురు చేతాను. చాలామంది బంధువులకి ఈశ్రాద్ధ సంతర్పణకివెళ్ళడం ఏమిటి అని సంకోచం కలిగింది మొదట్లో. అయితే వారు ఆపిలుపులో మరొకప్రతిధ్వని విన్నారు. ఆపిలుపుతో రావమ్మ తనగర్వం అణిగిపోయినట్లు ప్రకటించినట్లు అది అణగిపోయిన తరువాతనే తను తనబంధువుల ఆదరణ కోరుతున్నట్లు, తమఆదరణ ప్రసాదింపబడినట్లు చిహ్నంగా వారు తనయింటికివచ్చి తన కుమారుణ్ని ఆశీర్వదించ వలసినదిగా ప్రార్థిస్తున్నట్లు—ఆ ప్రతిధ్వని

తనకుతనే అర్థం చెపుతున్నట్లుగా గ్రహించారు బంధువులు. ఆఅవకాశం జారవిడిస్తే రావమ్మఓటమిని వారు స్వీకరించినట్లు ప్రకటించుకోడానికి మరో అవకాశం రాదు. పైపెచ్చు అదిఆమెకేజయం అవవచ్చు. ఈ భావం రాగా వారు ఆమెపిలుపు అందుకొని ఆనాడు ఆమెయింటికి వచ్చారు.

"చింతచచ్చినా పులుపు చావ"దని తనగృహస్థితి అసంతోష జనకంగా వున్నా తనలో శక్తిమాత్రం తగ్గలేదు రావమ్మకు. వచ్చిన బంధువులతో చాకచక్యంగా వ్యవహరించింది. అందరికీ రావమ్మతో ప్రత్యేకంగా మాట్లాడడానికి ఉబలాటం కలిగేటట్లు చేసింది. "సందట్లో సడేమియా" అన్నట్లు పురోహితుడు ప్రక్కమాటలుపెట్టి రంగానికి ఒక పెళ్లి సంబంధం కుదిర్చేశాడు. సంతర్పణ అయినతరువాత స్వర్గీయుని ఆత్మ శాంతికి అర్పణంగా తనకుమారుడి వివాహనిర్ణయం ప్రకటించింది. బంధువులందరికీ ఈప్రకటన ఆశ్చర్యం కలుగచేసి తమ జయాపజయాల జమాఖర్చులు తయారుచేయడం మరిపింపజేసింది. బంధువులంతా సాయంత్రం అయ్యేసరికి చల్లబడ్డ బుర్రలతో నీరసబడ్డ కాళ్లనీడ్చుకుంటూ ఇళ్లుచేరారు.

మరి కాలం వృథాపుచ్చక రావమ్మ రంగం పెళ్ళి అతిశీఘ్రంగా కానిచ్చేసింది. శ్రాద్ధం నాటికంటె యెక్కువ సంఖ్యలోవచ్చారు బంధువులు ఈ పెళ్ళికి. అయిదురోజులు ఫెళఫెళలాడుతూ పెళ్ళిచేయించి తనయింట ప్రత్యక్షమయిన నాలుగవ జీవాన్ని—కొత్తకోడల్ని—ఉత్సవ విగ్రహంలా అలంకరించి అందర్నీ తీసుకువచ్చి చూపించింది. అవతార మూర్తిలానే ఆమెను ఆదరిస్తూవచ్చింది. తరువాత రోజుల్లో తనయింటిలో యెప్పుడూ ముగ్గుర్నే కూర్చినముండా దేముడుమీద తనకు కలిగిన విజయానికి తన్నుతానే అభినందించుకుంటూ ఉండేఘడియలో, అనుకుండా దేముడే పంపినట్లుగా ఒకదూరపు బంధువు—ఆస్థిపరుడే ఒక ఆయన ఎదుట ప్రత్యక్షమయ్యాడు. ఏమిటావిషయం అని ఆమె తర్కించుకోక

ముందే ఆయన తన పాతచుట్టరికం దృష్టికి తెస్తూ తనచెల్లెలు కొడుక్కి - రాధనిచ్చి పెళ్ళి చెయ్యవలసినదిగా రాయబారం సాగించాడు.

బంధువులపై తనకు కలుగుతున్న విజయ పరంపరల్లో దేమునిపై తనకు కలిగిన విజయంమాట చెప్పాన మరిచిపోయిందిరావమ్మ. వెంటనే సంబంధానికి ఒప్పుకుంది. తన బంధువులపై ఈసారి మంచిఅస్త్రం ప్రయోగించాలని ఆశించింది. శ్రాద్ధం, ఆపైన కొడుకుపెళ్లి, ఇప్పుడుమళ్లీ కూతురుపెళ్లి, మొదటిది అరగకముందే మరొకటి బంధువులనోట కుక్కాలని ఆత్రంతో ఫెళఫెళలాడుతూ తన కూతురుపెళ్లి మళ్ళీ అయిదురోజులూ చేయించింది. బంధువులంతా ఈఅపజయాల అజీర్ణంతో అవస్థ పడుతూండగానే ఆమెకు మరోవిజయం ప్రాప్తించింది. తన కొత్తఅల్లుడు ఏదో ప్రత్యేక అధ్యయనంకోసం ఇంగ్లండు వెడుతున్నాడు. తనకూతురుని కూడా వెంటబెట్టుకువెడితే ఆ ఆరునెలల ఖర్చూ తనే భరిస్తానంది. సహర్షంగా ఒప్పుకున్నాడు అల్లుడు. కూతుర్ని అల్లుడితోపాటు ఇంగ్లండు పంపించగలిగిన కుటుంబం ఆశాఖలో రావమ్మదితప్ప మరెవరిదివుంది? అది ఆమె నెత్తికి కిరీటంఅయింది! ఆవేళ కూతుర్ని అల్లుణ్ని కారెక్కించి పట్నం పంపుతూన్నపుడు ఆమెతృప్తీ, గర్వం పరాశిఖరాన్ని అందుకున్నాయి.

కారు అటువెళ్ళింది. ఆమె ఇటుతిరిగి గుమ్మంలోకి అడుగుపెట్టింది. ఎదురుగా కనిపించారు కొడుకూ కోడలూను చిరునవ్వుతో. అంతకుముందువరకు ఆమె ముఖంమీద తాండవిస్తూవచ్చిన నవ్వు ఎందుకో అమాంతంగా ఎగిరిపోయింది. ఆ ఎగిరిపోయిన నవ్వును పట్టుకోడానికో అన్నట్టు ఆమె నలువైపులా చూసింది ఆత్రంగా; ఎక్కడా కనుపించనట్టు తోచేసరికి ఒక్క దీర్ఘనిట్టూర్పు విడిచింది. ఆనిట్టూర్పుకు సానుభూతి చూపిస్తున్నట్లు "నేను నీ ఎగిరిపోయిననవ్వుని, నేనిక్కడున్నా" నన్నట్టుగా తనకూతురు ఎక్కిన కారు హారనుచప్పుడు దూరంగా వినిపించింది. తను

లోపల అడుగుపెట్టి ఇంట్లోనిజీవాలను లెక్కపెట్టింది—ఒకటి, రెండు, మూడు. ఈసారి మళ్ళీ "ముగ్గుర్నికూర్చిన ముండాదేముడు" జయం పొందాడు. ఆ పరాభవంలో దిగులుపడి అమట్టున నే మంచంపట్టింది రావమ్మ!

వానవెలిసిన మబ్బులా సద్దుమణిగిన ఆయింటినిచూసి లోకులు, ఆమె విజయాలకు ఈర్ష్యపొందిన బంధువులు మళ్ళీ సమపాతపాట ఆలాపించసాగారు. "ముగ్గుర్ని కూర్చాడురా ముండా దేముడు!" రావమ్మకి ముచ్చెమటలు పోసాయి. తన పరాజయంలోని విజయాన్ని ఆమె నిలపెట్టుకోలేక పోయింది. తన విజయంలోని పరాజయాన్ని ఆమె సహించలేక పోయింది.

విరిగిపోయిన దూలంమీద నిలబడ్డ ఇంటికప్పులా తనబ్రతుకు ఈడ్చుకుంటూ వచ్చింది రావమ్మ, ఈవిధంగా మరికొన్నిమాసాలు. మళ్ళీ కృష్ణపక్షంపోయి శుక్లపక్షం వచ్చింది. శుక్లపక్షంలో పాడ్యమినాడు చంద్రుడు ఉదయించినట్టుగా ఆమెకు మనమడు అవతరించాడు ఆయింట! ఆమెకు బ్రహ్మానందం కలిగింది. ఈసారి మళ్ళీ దేముణ్ని తలచుకుంది. భక్తి శ్రద్ధలతో కాదు. విజయగర్వంతో! "సంతోషం సగం బలం!" ఆమె కోలుపోయిన సగంబలం పూడుకుపోయింది. వెంటనే పిల్లాడి బారసాల ఏర్పాటు చేయించింది. వేళ్ళికంటె ఎక్కువదిక్యంగా జరపించింది. తేనెమీద వాలడానికివచ్చిన ఈగల్లామళ్ళా బంధువులంతా సంతర్పణకి హాజరయ్యారు. ఎటువైపు చూసినా తనేకనిపిస్తూ రావమ్మ ఆనాటి కార్యం అంతా తనచేతి సంజ్ఞలపై నడిపించింది. "క్రిందపడ్డా చెయ్యిపైనే" అని నిరూపించుకుని బంధువులని సాగనంపింది సాయంత్రం. బంధువులకి, ఇప్పటికి రావమ్మ ఒకసమస్య అయిపోయింది. ఆసమస్యను తేల్చలేని బేలమొహాలతో వాళ్ళు యిళ్లమొహాలు పట్టారు.

వాళ్లని సాగనంపి ఇంట్లో అడుగుపెట్టింది రావమ్మ. ఎదురుగా కొడుకూ కోడలూ మనవడూ, ముగ్గురు కనిపించారు. మొహంమీద నవ్వు పేర్చుకుంటూ వాళ్లవరుసన నిలబడి లెక్కపెట్టింది- ఒకటి,రెండు, మూడు, నాలుగు! నాలుగుఅంటూ, కొంత శ్రమతీర్చుకుందామని ప్రక్కమీద వాలింది.

మరి నాలుగు రోజులపాటు ఆప్రక్కమీంచి లేవలేదు. నాలుగోనాడు ఆమె ఆఖరిరోజులా అయిపోయింది. అసలే ఆరోగ్యం బాగులేదు. అందుమీద భారసాలఅంతా తనచేతిమీద నడిపించింది. దానితో ఆమెపని పూర్తిగా చితికిపోయింది. ఆఖరి ఘడియల్లో తనకొడుకూ, కోడలూ, మనమణ్ణి ఎదురుగా నిలబెట్టింది. లెక్కపెట్టింది—"ఒకటి రెండూ మూడు" దూరాన "ముగ్గుర్నికూర్చిన ముండాదేముడి"మీద ఒకపాట గాలిలో ఎగురుతూంటే ఆమె "ముమ్మూరు" దేముణ్ణి ప్రార్థించి శాశ్వతంగా కళ్ళు మూసింది.

# కథకులతో

శరణు కమలాదేవి—విముక్తి

స్త్రీ హృదయాన్ని చక్కగా చిత్రించారు. భాషలో కొంత మార్పు తీసుకురావాలి. కథలో సంభాషణలు ఇమిడ్చడం అలవాటు చేసుకోండి.

వి.వి.ఎస్. ప్రకాశరావు—అసలుసంగతి

మీ కథారచనావిధానం (టెక్నిక్) ప్రశంసనీయంగాఉంది. ఐతే మీరు కొంచెం గంభీరమైన కథావస్తువును ఎన్నుకోవాలి.

తోయజాక్షరావు—స్వయంవరం

మీ కథ యువ హృదయాలలోని బాధను బాగానే వ్యక్తంచేసింది. మీరింకా టెక్నిక్‌లో అనుభవం సంపాదించాలి.

యస్. కృష్ణమూర్తి—నాకథ

మీకథ హృదయాన్ని స్పందించే సత్తువను కలిగిఉంది. భాషను కొంచెం సరళంచేస్తే బాగుంటుందేమో!

గోసురాపంత్—తమ్ముడికోసం

మీ కథా వస్తువుమంచిది. రచనావిధానంలో మీరు అనుభవంపొందాలి.

రాజేశ్వరీరాణి—రామిగాడిబండి

కథావస్తువుకు తగిన భావాలు, పాత్రలకు తగిన భాష చక్కగా ఉన్నాయి. కథకు క్లైమాక్సు అంటూ ఉండాలిగా. ఆ విషయంలో జాగ్రత్తపడండి.

సాత్యకిరావు—అదృష్టం

చక్కనికథ. రచనావిధానం బాగుంది. ప్రయత్నిస్తే ఇంతకంటే మంచికథలు మీరు వ్రాయగలరు.

సత్యమూర్తి—అంతేగామరి

హాస్యరసాన్ని కలిగించే కథలు మీరు వ్రాయగలరు. కథకు ఘటన ప్రాణం అని మీరు గ్రహించాలి.

ఆరణి దశరథరెడ్డి—నేటి చదువులు

పల్లెవాతావరణాన్ని హృద్యంగా చిత్రించిన మీ కథ చాలా బాగుంది. సంభాషణలు సహజంగా ఉన్నాయి.

ఆ. రా—చమురందని వత్తులు

కథకు పేరుపెట్టడంలో మీరు నిపుణులు. రచనల్లో అనుభవం పొందండి.

స్వర్ణ—అంతర్యం

చక్కని శైలిలో జయప్రదంగా సాగించారు రచనని. గంభీరమైన ఒక మనస్తత్వాన్ని చక్కగా విశదీకరించారు.

జోస్యుల—ఆనాటి స్వప్నం

కథ చాలా గంభీరంగానడిచింది. కథ వ్రాసేప్పుడు ఒక ఉద్దేశ్యాన్ని మనస్సులో ఏర్పరచుకోండి.

ఏ. కృష్ణమూర్తి—ఎడ్యుకేషన్

సరళమైనరచన. కథలో ఎక్కువ విషయాల్ని సన్నివేశాలని జొప్పించకుండా చూడండి.

రామసుబ్బారెడ్డి—విషాదఘటన

మీ ప్రకృతివర్ణనలు హృదయంగమంగా ఉన్నాయి. కథలో ఒక ఉద్దేశ్యం కనిపించడం లేదు.

బాలశౌరిరెడ్డి—దాగనిసత్యం

మీ ఉద్దేశ్యాలు, భావాలు మంచివి. రచనా విధానాన్ని మీరు అల వరచుకోవాలి.

సత్య—ఎప్పుడూ ఇంతే

పురుషుని హృదయంలోకి తొంగి చూసేందుకు స్త్రీచేత చేయించిన మీ ప్రయత్నం చక్కగా ఉంది.

శ్రీ రామారావు—పాండురంగని ప్రగల్భాలు.

ఇది కథలా కాకుండా వ్యక్తి చిత్రణంలా ఉంది. భావను సరిదిద్దుకోవాలి.

నాగేశ్వరరావు—అనాడు

కథలో వ్యంగ్యం కనిపిస్తోంది. మీ కథలో కథ గమ్మత్తుగానే ఉంది!

కర్రా ప్రభాకర్—మూడుముళ్లు

ముందు పేరుపెట్టి తర్వాత కథరాసినట్టనిపిస్తోంది. కథ హృద్యంగా ఉంది. మీ కథకు మిమ్మల్ని మూడుసార్లు అభినందిస్తున్నాం.

[కథలు చదివింతర్వాత ఈ వ్యాసం చదవమని మా సలహా.]

---

# కథానిక—3.

ప్రఖ్యాతరచయితల కథలతో ప్రత్యేక సంచిక

శ్రీ కొడవటిగంటి, పద్మరాజు, చలం, మునిమాణిక్యం, శివశంకర శాస్త్రి, విశ్వనాథ, శ్రీపాద, దీక్షితులు, గోపీచంద్, కవికొండల మున్నగు వారి కథలతో మూడవ కథానిక వెలువడుతుంది.

క్రొత్తరచయితలకిది ఆదర్శ కథల సంపుటి.

పాఠకులు తమ ప్రతిని రిజర్వు చేసుకోండి

మా 'కథానిక'లను తదితర ప్రసిద్ధ ప్రచురణలను అమ్మడానికి ఆంధ్ర దేశమంతటా ఏజెంట్లు, పుస్తకవిక్రేతలు కావాలి. మంచి కమిషన్.

వివరాలకు,

## విజ్ఞాన సాహితి

మద్రాసు - 17.

# శ్రీ [illegible] స్టోర్స

బుక్ సెల్లర్స్ & సోల్ ఏజెంట్స్

**2-64, పాండీ బజార్ రోడ్డు, మద్రాసు - 17.**



విజ్ఞానసాహితి, దేశకవితామండలి, ఆదర్శగ్రంథ మండలి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, కుబేరా ఎంటర్‌ప్రైసెస్ లిమిటెడ్ మొదలైన ప్రఖ్యాత ప్రచురణ సంస్థల అన్ని ప్రచురణలూ మావద్ద లభిస్తాయి. తెలుగులో ఏ పుస్తకంకోసమైనా మాకు వ్రాయవచ్చు.

లైబ్రరీలకు కోరిన గ్రంథాలు సప్లై చేయబడతాయి.

## సోల్ ఏజెన్సీ

తెలుగులో వెలువడే గ్రంథాలు, పత్రికలు మద్రాసు నగరంలో సోల్ ఏజెన్సీ తీసుకుని మాద్వారా నగరంలో ఎక్కువ ప్రతులు అమ్ముడు పోయేటట్లు చూడగలం.

వివరాలకు వ్యాపార నియమాలకు పై అడ్రసుకు వ్రాయండి.

ri Rama & Co., (Bharathamata Press), 39, Anderson St., Madras-1.